# పెండ్లి

కర్త:

డాక్టరు చిలుకూరి నారాయణరావు, ఎమ్.ఏ., పిఎచ్. డి., ఎల్.టి.

ప్రకాశకులు.

ఆత్రేయాశ్రమము, అనంతపురము.

1938.

# తొలిమాట

నేను రచించిన 'అంబలో' ఒక స్త్రీని ప్రధానపాత్ర[redacted] చేసి, ఆమె శీలమెట్లు నానాటికిన్ని పరిణామము పొంది భీష్మ పతనమునకు, కారణమైనదో నిరూపించినాను. వీర, భయానక, బీభత్సముల యసహ్యాత్వము కానరాకుండుటకు, హాస్య రసము సర్వత్ర ఎట్లు తోడ్పడగలదో ఆ నాటకములో చూపినాను.

'అశ్వత్థామ' లో కరుణబీభత్సములు నిరూపింపబడినవి. అశ్వత్థామ రాజభక్తి, మిత్రప్రేమ, పితృభక్తి, వీరము, ప్రస్ఫుటము చేయబడినవి

'అచ్చి' లో శృంగారాది రసములు రాజులు మొదలగు వారి యందేకాక, సాధారణపామరజనములందును ఎట్లువెలయునో చిత్రింపబడినది. సంఘదురాచారములు మొదలగు విషయములు హాస్యరసము మూలమున ఇందు నిరూపింపబడినవి.

ఈ 'పెండ్లి' కూడా సాంఘికనాటకమే. ఆధునికాశయములకున్ను ప్రాచీనాచారములకున్ను గల నేటి సంఘర్షణమందు కాననగును.

మొదటి మూడునాటకములున్ను ప్రజాదరణమును గాంచినవి. ఈ 'పెండ్లి' కూడ ప్రజానందమునకు తోడ్పడును గాక.

గ్రంథకర్త.

# పాత్రములు

| | | |
|---|---|---|
| సుబ్బారావు | ... | కమల, రామారావుల తండ్రి |
| అవధానులు | ... | పురోహితుడు |
| విశ్వనాథయ్య | ... | సంగీతపు మేష్టరు |
| రామారావు | ... | సుబ్బారావు కుమారుడు |
| మోహనరావు | ... | రామారావు స్నేహితుడు |
| సంజీవరావు | ... | ఒక విద్యార్థి |
| సీతమ్మ | ... | సుబ్బారావు భార్య |
| రాగమ్మ | ... | సుబ్బారావు తల్లి |
| కమల | ... | సుబ్బారావు కూతురు |

# పెండ్లి

## రంగము. ౧.

(ప్రవేశము : సుబ్బారావు, భార్య సీతమ్మ)

సుబ్బా: ఊఁ, ఔనా!

సీత: ............

సుబ్బా: ఔనా! నిన్నే!

సీత: ఏమి?

సుబ్బా: మాట్లాడ దలచుకోలేదా?

సీత: ఏమి మాటలు?

సుబ్బా: ఏమి మాటలయినాసరే.

సీత: ఏమిమాటలున్నాయి, మాట్లాడడానికి?

సుబ్బా: మాట్లాడ దలచుకొంటే మాటలే ఉండవా?

సీత: మీకెందుకు పాపము కోపం? మాట్లాడు తాను వినండి.

సుబ్బా: ఏదీ, మాట్లాడూ, విందాం.

సీత: ఒక కథ చెప్పనా?

సుబ్బా: సరే, చెప్పు.

సీత: అనగా, అనగా ఒక సుబ్బారావుగారట.

సుబ్బా: ఓహో, నాకథే ఆరంభించినావే!

సీత: సుబ్బారావు ఈలోకములో మీరొక్కరేఉన్నారా ఏమిటి? ఒక సుబ్బారావన్నానుగాని, ఈయింటి యజమాని సుబ్బారావుగా రనలేదే!

సుబ్బా: సరే, కానీ, అదేదో చెప్పదలచుకొన్నావు. వదులు నీఉపన్యాసము.

సీత: ఉపన్యాసాలివ్వడానికి మీవలె సభలలో నే నారితేరి ఉండలేదు.

సుబ్బా: కథకానీ.

సీత: ఆసుబ్బారావుకి సీతమ్మ అని ఒకభార్య.

సుబ్బా: నువ్వేనా?

సీత: నేనుకాదండీ. ఒక సుబ్బారావుకు ఒక సీతమ్మ భార్య.

సుబ్బా: ఊఁ హూఁ!

సీత: వారిద్దరికీ కమలఅని ఒక్కతే కూతురు.

సుబ్బా: ఏదో తీస్తున్నావు.

సీత: ఆకూతురు చెన్నపట్నంలో చదువుకొంటున్నది.

సుబ్బా: అవును, అయితే?

సీత: అయితే, ఆపిల్ల తండ్రికి, ఆపిల్లచదువుకొనడము ఇష్టము లేదు.

సుబ్బా: నీకెవరు చెప్పినారు?

సీత: అయ్యో, ఇది కథండీ!

సుబ్బా: ఊఁ హూఁ !

సీత: ఆపిల్లకి చదువు వదలిపెట్టడం ఇష్టంలేదు.

సుబ్బా: ఆపిల్ల నీతో చెప్పిందా ?

సీత: కథలో వాళ్లు మనతో చెప్తారటండీ!

సుబ్బా: నీదగ్గరఏదో యక్షిణీ ఉన్నట్టుంది.

సీత: కథచెప్పడానికి యక్షిణీవిద్యకూడా కావాలా ! చెప్పినదేదో ఊఁ కొట్టుతూ వినండి.

సుబ్బా: కానీ.

సీత: కూతురికి సుబ్బారావుగారు పెండ్లిచేయ తలపెట్టి నారట.

సుబ్బా: నేను తలపెట్టలేను. నువ్వుభ్రమ పడుతున్నావు.

సీత: నేనుభ్రమపడినా,మీరు మనకమలకు పెండ్లి తలపెట్టక పోతే సంతోషమే. కాని, ఆకూతురికి, ఆసుబ్బారావుగారు, పెండ్లిచేయ నిశ్చయించడ మేమో అబద్ధముకాదు. . .

సుబ్బా: మున్నాటికీ అబద్ధము.

సీత: అయ్యో! శుభలేఖలుకూడా అచ్చయితే!

సుబ్బా: ఏదీ, చూదాము ఒకటిచూపెట్టు ?

సీత: సరే, అవి ఇప్పుడే ఎక్కడ బయటపడుతాయి? వాటికి సమయము రావాలి.

సుబ్బా: ఒకవేళ మనకమలకు పెండ్లిచేయడానికితలపెట్టినానే అనుకో. కన్యాదానము చెయ్యడానికి నీవురావా?

సీత: మీరు పెండ్లితలపెట్టడము ముమ్మాటికీ అబద్ధము కాదూ! మీరు తలపెట్టి చేసేటప్పుడు నేనురావడము..........

సుబ్బా: ముమ్మాటికీ అబద్ధమంటావు.

సీత: నేననడానికిగాని, అనకపోవడానికిగాని స్వతంత్రముంటేకదూ ?

సుబ్బా: కనిపెంచినదానవు, నీకుస్వతంత్రముకాకపోతే మరెవ్వరి కాస్వతంత్రము!

సీత: ఎవరికా? స్వతంత్రించినవారికి. నామాటకేమిలెండి.

సుబ్బా: నీమాటలేనిదే నేను కమలకు పెండ్లి చేస్తానా?

సీత: నామాటకేమి? మీ అమ్మగారిమాట వినకపోతే తప్పుతుందా?

సుబ్బా: ముసలిదేదో అంటూవుంటుంది. 'ఆఁ,ఆలాగే' అంటే తీరిపోతుంది. కమలకు పెండ్లిచేయడమే నిశ్చయమైతే నీతోచెప్పకుండా ఉంటానా?

సీత: నిశ్చయమైన తరువాత, మరినాతోచెప్పేదేముంది? పెండ్లిపనులు చెయ్యమని చెప్పడమేకదూ?

(తెరలో: సార్! టెలిగ్రాం)

సుబ్బా: (పోయిపుచ్చుకొని వస్తున్నాడు)

సీత: ఎక్కడనుంచి టెలిగ్రాం?

సుబ్బా: (విప్పిచూచి) ఇది వేరే లే. బొంబాయినుంచి.

సీత: బొంబాయిలో మన కొత్తబంధువు లెవరున్నారు? ఏదీ, ఇలాచూడనివ్వండి!

సుబ్బా: చూచేదానికేముంది? ఇది రహస్యం.

సీత: రహస్యమయితే దాచుకోండి.

సుబ్బా: తరువాత చెప్తానులే.

సీత: వాళ్లు వస్తున్నారా.

సుబ్బా: వాళ్లెవరు?

సీత: వాళ్లు, పెళ్లివాళ్లు.

సుబ్బా: కాదులే.

సీత: పోనీ, మంచి టెలిగ్రామే కదా!

సుబ్బా: ఆ! మంచిదే. నువ్వేమీ బెంగపెట్టుకోకు.

సీత: నాకేమిబెంగ, నిర్వహించేవాళ్లు మీరుంటూ ఉండగా? పోయి, టెలిగ్రాము మీ అమ్మగారికి చూపి రండి.

సుబ్బా: మా అమ్మకు చూపడానికి నీవలె దానికి చదువు వస్తేకదూ.

సీత: పోనీ, వినిపించిరండి. ముసలిది, పాపం, సంతోషిస్తుంది.

(సుబ్బారావుతల్లి రాగమ్మ ప్రవేశము)

రాగ: ఏమిరా, సుబ్బూ!

సుబ్బా: రా అమ్మా, రా.

రాగ: అయితే అవధానులుని పిలిపించి ముహూర్తం పెట్టించావా, లేదా, ఇంకా ?

సీత: దేనికి, అత్తా ?

రాగ: కమలమ్మ పెండ్లికే, కోడలా !

సీత: ఎప్పుడు పెండ్లి ?

రాగ: ముహూర్తం పెట్టగానే.

సీత: ఇంకా ముహూర్తం పెట్టలేదూ ?

రాగ: లేదు, అవధానులు వచ్చి పెడతాడు.

సీత: ముహూర్తం పెట్టడానికి అవధాను లెందుకత్తా ? ఇన్ని పెండ్లిండ్లు మీ చేతిమీదుగా చేయించినారు. మీరే "అయం ముహూర్త స్సుముహూర్తోఽస్తు" అనియ్యండి, మంగళాళ్లకు కబురంపిస్తాను.

సుబ్బా: ఇదే మిట్లా అమంగళంగా మాట్లాడుతావు ?

రాగ: దాని నోటివెంట అట్లాటి మాటలుకాక యింకేమి వస్తాయి ?

సీత: మీరుపెట్టే ముహూర్తానికి మంగలాళ్లక్కర లేదూ? మేళం తాళం లేకుండానే జరిగించేస్తారా ఏమిటి, పెండ్లి?

రాగ: ఏదో ఏడుస్తాము. నీకూతురికి పెండ్లి చెయ్య ప్రయత్నిస్తూఉంటే, కయ్యానికి కాలుదువ్వతావేమిటే?

సీత: అత్తా, మీకొమారుడికేదో టెలిగ్రాము వచ్చింది. చదువమనండి. మీ రేర్పాటు చేసిన పెండ్లి ఆగిపో యినట్లుంది.

సుబ్బా: లేదమ్మా, దానిమాటల కెక్కడికి ?

సీత: ఏమిటి లేదు ? టెలిగ్రాము రాలేదా? పెండ్లి ఆగిపో లేదా? అదిగో అత్తా, ఆ జేబులో ఉంది.

రాగ: ఉంటే ఉంది, నీ కెందుకు? (మెల్లగా) ఏమిటిరా, నాయనా, టెలిగ్రాపట? అందరున్ను బాగున్నా రుగదా?

సుబ్బా: బాగానే ఉన్నారు.

రాగ: బాగుంటే టెలిగ్రాఫెందుకురా ?

సుబ్బా: కమల ఈ రైలులో వస్తున్నదట.

సీత: ఎవరు, మనకమలేనా? అదేనా, టెలిగ్రాం?

సుబ్బా: అవును.

సీత: దానికింత దాచుకోనడ మెందుకూ ? నాకు చెపితే నేను సంతోషించనూ?

సుబ్బా: ఊర్మమధ్యని ఎందుకు పిలిపించినావని కోప్పడుతావని నీతో చెప్పలేదు.

సీత: అంతేనా? అయితే లెండి, టైమయింది. స్టేషనుకు పోయి కమలను తీసుకవత్తాము.

రాగ: నువ్వుకూడా ఎందుకు, తోకబాగ ఇంట్లోపనీపా టూ మానుకొని? స్టేషనులో దిగినవాళ్లు ఇంటికిరా

కుండా ఉంటారా? ఈకాలపువాళ్లకు మొగుళ్లతో చెట్టాపట్టా వేసుకొని తిరుగడమంటే సరదా. మా కాలంలో ఇటువంటి వెప్పుడున్ను ఎరుగమమ్మా!

సీత: మీఖర్మంమీది, మాఖర్మంమాది.

రాగ: అయితే, నీకూతురికికూడా నేర్పు, నీబుద్ధులు.

సుబ్బా: అమ్మా, దానితోనేమిటి, ఊరుకో!

రాగ: నన్నూరుకోమంటావా? నీపెళ్లాన్ని వాగమంటావా? బాగుందిరా, నాయనా, బాగుంది.

సీత: ఏమండీ, ఇంకా పదినిమిషాలు మాత్రముంది. లేస్తారా ?

సుబ్బా: నా కొంట్లో బాగులేదు. అబ్బాయిని పిలు? వాడు పోయి తీసుకొస్తాడు.

సీత: ఏమి, మన మిద్దరమున్ను పోకూడదా ?

రాగ: వాడి ఒంట్లో బాగులేదంటూఉంటే, ఏమి టిట్లా పట్టుకొన్నావు.

సీత: ఏమి టొంట్లో? డాక్టరుకు కబురంపనా ?

సుబ్బా: అబ్బాయీ, రామూ!

(రామూరావు ప్రవేశము.)

రామూ: ఏమి నాన్నా ?

సుబ్బా: మీచెల్లెమ్మ కమల ఈరైలులో వస్తుందట. సైకిలుమీద స్టేషనుకు పోయి, జట్కా చేయించి తీసుకొనిరా.

రామా: కమల యిప్పుడెందుకు వస్తున్నది ?

సీత : మీనాన్నగారు టెలిగ్రామిచ్చి పిలిపించినారు. కమలకు మీఅవ్వ పెండ్లికుదిర్చిందిచి. రేపే ముహూర్తం.

రామా: అవునా, నాన్నా?

సుబ్బా: ఏమో, మీఅమ్మనే అడుగు.

సీత : అవునురా, రాముా, శుభలేఖలుకూడా అచ్చవుతే !

రామా: అయితే, మా బావెవరో !

సీత: వచ్చినతరువాత పెండ్లిపీటలమీద చూతువుగానిలే.

సుబ్బా: రాముా, మీఅమ్మమాటలతోనేమిటి? పో, టైము అవుతున్నాది.

రామా: ఇదిగో పోతున్నాను, మీరుచెప్పకపోతే, కమల అయినా చెప్పదాయేమిటి? (పోతాడు)

సుబ్బా: అమ్మా, పోయి, వంటాగింటాచూడు, పాపం కమాల ఆకలితోవస్తుంది.

రాగ : నీపెళ్ళామేమి చేస్తుంది? కుడిచేతికెడమచెయ్యిసాయంలేకపోతే, ముసలిముండనెలాగుచస్తానురా ?

సీత : పదత్తా, నేనుకూడావస్తాను.

రాగ : ఎందుకూ? భోజనానికా?

సీత : అవునందుకే, పదండి.

(తెర.)

# రంగము. ౨.

(సంగీతమయ్యవారు విశ్వనాథయ్య, కమల)

విశ్వ: ఏమమ్మా, కమలా, నీకు నేర్పినపాటలన్నీ పట్నంలో సాధకం చేస్తున్నవా? అన్నీ మరచిపోయినావా?

కమ: ఏమిటోనండీ, ఈచదువులనుంచి ఒక్కక్షణంకూడా తీరుబాటుండదు. ఉదయం ఆరుగంటలకులేచిన దగ్గరనుంచీ క్లాసుపాఠాలు చదువుకోవాలి. తరువాత సాయంత్ర మయిదుగంటలవరకున్ను కాలేజిలోనే ఉండాలాయె. ఆపైనిబీచికిఒక్కసారివెళ్లి, తిరిగీ వచ్చి భోజనంచేసేసరికి ఎక్కడలేని అలసటావచ్చి నిద్రఆవరిస్తుంది. ఇకసంగీతానికి వేళయెక్కడ?

విశ్వ: అయితే పట్నంపోయినతరువాత మరి కృషిచెయ్యనే లేదన్నమాట!

కమ: లేదండీ.—అయ్యవారుగారూ! "అలకలల్లలాడగ" కృతి ఒక్కసారిపాడరూ? ఎన్నాళ్లయిందండీ, మీపాటవిని!

(సీతమ్మ ప్రవేశము.)

సీత: ఏమే, కమలా, ఇక్కడనేకూర్చున్నావా! నాన్నగారెంతసేపటినుంచో పిలుస్తున్నారు. వినబడలేదటే?

కమ: ఉండమ్మా, నాన్నగారికి మరేమీపనిలేదు. ఒక్క

పాటవిని వస్తానని చెప్పు. పాడండీ, నేను శ్రుతివే
స్తాను.

సీత : పాటంటే కమల చెవికోసుకొంటుంది, దానినాన్న సంగీతపుగొడ్డలి.

విశ్వ : (పాడుతున్నాడు.)

(రామారావు ప్రవేశము.)

రామా : అమ్మా, నాన్న గారు తొందరపడుతున్నారు. కమలను తీసుకొని వెంటనే రమ్మంటున్నారు. ఎవరో వచ్చి కూర్చున్నారు.

కమ : ఉండురా, అన్నయ్యా! వచ్చినవాళ్లు కూర్చుంటే, పనికాగానే లేస్తారు. మనతో వాళ్ల కేమిపని? మధ్యమధ్య నెవ్వరున్నురాకండి. కానియ్యండీ!

సీత : మాకమలకు అలకల్లలాడేవాడు కావాలి.

కమ : (సిగ్గుతో) ఊరుకోఅమ్మా!

విశ్వ : (పాడుతున్నాడు.)

(సుబ్బారావు ప్రవేశము.)

సుబ్బా : ఏమర్రా, ఇంటికి వచ్చినవాళ్ల నవమానంచేయదలచుకొన్నారా? పాపం, వాళ్లెంతసేపు కూర్చుంటారు?

సీత : ఇప్పుడుకాస్తసేపు కూర్చొనడాని కోపిక లేనివాళ్లు మనతో నేమిసంబంధం చేస్తారు? అంతతొందరయితే దయచెయ్యమనండి.

సుబ్బా: మంచి మర్యాదస్థురాలవే. లే అమ్మా, కమలా, ఒక్కక్షణంలో తిరిగివత్తువుగాని?

సీత: అయ్యవారుగారూ, ఏదండీ, మరొక్కకీర్తన? "రారామాయింటిదాకా" మాకమల ఆపాటపాడుతూఉంటే కిన్నెరలు మోగుతూఉండేవి. సాధకం చెయ్యక అంతామరచిపోయింది.

సుబ్బా: మరి నేనుచెప్పితేవిన్నావూ? 'ఇంగ్లీషు చదువులో పెట్టవద్దే' అని ఎంతమొత్తుకొన్నా, కమలను పట్నానికి ప్రయాణముచేసినావు. దానిపని ఉభయభ్రష్టత్వమయింది.

సీత: మీరూరుకోండీ! ఆయనపాడుతారు!

సుబ్బా: విశ్వనాథయ్యగారూ,మీరుపాడవద్దు. వాండ్లనుపంపి వేసినతరువాత మీయిష్టంవచ్చినంతసేపు పాడుకోండి.

సీత: ఆయనతోనేమిటి? మీరుపాడండీ!

రామా: అయ్యవారుగారూ, నేనొక పాటవ్రాసినాను, వింటారా?

సుబ్బా: నువ్వూరుకో, నువ్వూ, నీపాటాను! లే, అమ్మా, కమలా.

కమ: పాడురా, అన్నయ్యా!

రామా: నువ్వుశ్రుతివెయ్యి. (పాడుతున్నాడు)

తాత దగ్గుచుండగ మా-
అవ్వయెంత కులికెనో మది, (తాత.)

(రాగమ్మ ప్రవేశము.)

రాగ : ఏమిటిరా పాడుతున్నావు, పెంకెఘటవా!

రామా : తాతమీదకీర్తనకట్టినానవ్వా, విను, ఎంత బాగుందనుకొన్నావో!

కునికిపాట్లు పడుచు చొంగ
కార్చుకొనుచు నుండగగని? (తాత)

రాగ : ఒరే, నీకు దుడుసుతన మెక్కువయిందిరోయ్!

రామా : (పాడుతున్నాడు.)

చిన్నప్పటి చేష్టలమది-చెప్పరాని మోహముతో
చొక్కిపళ్లతోడి తొస్సి-మాటలతో-పలుకరించి (తాత)

సీత : అవ్వామనుమలసంవాదం మాబాగుంది !

రాగ : (వెక్కిరిస్తూ) అవునే! బాగుండకేమిచేస్తుంది? బాగానేర్పిపెట్టినావులే, పిల్లలకి!

రామా : (స్వరకల్పన చేస్తున్నాడు.)

సరిగా-గని, మగవానిని-మరి దాసరి-గమగమమని, (తాత)

రాగ : ఒరే, నోరుమూస్తావా, లేదా ?

రామా : "మా, సరిదా, నినిగని, మా......"

రాగ : ఏమిరా సుబ్బా, వాండ్ల నక్కడ కూర్చోపెట్టివచ్చినావు. వాండ్లేమనుకొంటారురా!

రామా : ఏమీ అనుకోరులే......అవ్వా, నీకు పెళ్లట, ముహూర్తం కుదిరిందా ?

రాగ: కుదురుతుందిరా, కుదురుతుంది. నీపెళ్లప్పుడే నా పెళ్లీన్నీ, నీకుపెళ్లి చేయిస్తానుండు.

(అందరున్ను నవ్వుతారు.)

సీత: ఏదండీ, "రారా మాయింటిదాకా"?

సుబ్బా: విశ్వనాథయ్యగారూ, మీరుపాడకండీ. లే, అమ్మా, కమలా, మొగముచూపించి వచ్చేస్తువుగాని.

విశ్వ: సుబ్బారావుగారూ, ఏమిటండీ ఆతొందర? పాపం, పిల్లలంతో సరదాపడుతున్నారు, కూర్చోండి, మీరు కూడా విందురుగాని.

సుబ్బా: ఓహో, మీరుకూడా పిల్లల్లో కలిసినారూ? అయితే వేగంకానియ్యండి.

సీత: కూచోండీ. ఏమిటీ అడావుడి?

రాగ: ఏమిరా, సుబ్బా, పద, మనమిద్దరం పోదాము, వాళ్లకు కోపంవస్తుంది.

రామా: అవ్వా, నువ్వువెళ్లి వాళ్లతో మాట్లాడుతూఉండు. అవధానులుచేత ముహూర్తం పెట్టిస్తూఉండు. ఇప్పుడే వచ్చేస్తాము.

రాగ: మీఖర్మం! (పోతున్నది.)

విశ్వ: (పాడుతున్నాడు) "రారా మాయింటిదాకా."

రామా: (పాడుతున్నాడు) "పోరా మీయింటివంకా."

కమ: అన్నయ్యా, ఊరుకో, విందాము!

సీత : ఎవరమ్మా రావాలి, మీా యింటిదాకా ?

విశ్వ : కోదండరాము డమ్మా !

సీత : అవునా, కమలా, రావాలా ?

కమల : ఉండమ్మా !...... పాడండీ!

విశ్వ : (పాడుతున్నాడు.)

(అవధానులు ప్రవేశము.)

రామా : దయచెయ్యండి, అవధానులు గారూ! పంచాంగం పట్టుకొని వచ్చినారా, లేదా ?

అవ : అహ్హాహ్హా ! ఏమిటో అంఛారు. సుబ్బారావుగారూ, ఇదేమిటండోయ్, పెళ్లికోసం వచ్చినవాళ్లనక్కడ కూఛోపెట్టి, మీారిక్కడకూఛున్నారు? వాళ్లేమను కొంఛారు?

సుబ్బా : నన్నేమి చెయ్యమన్నారండీ! వీళ్లెంత మొత్తుకొన్నా లేవరు.

అవ : సీతమ్మగారూ, మీారుకూడా ఇట్లాచేస్తే ఎట్లా?

రామా : అవధానులు మామగారూ, మీాకుజ్యోతిశ్శాస్త్ర మేనా? సంగీతంలోకూడా ఏమయినా ప్రవేశముందా?

అవ : ఓ! దానికేం? 'శిశుర్వేత్తి, పశుర్వేత్తి, వేత్తి గాన రసంఫణి' అన్నాడు శాస్త్రకారుడు.

రామా : అయితే,- మీారు, శిశువులా,- పశువులా,- ఫణులా?- ఏవర్గంలో చేర్చమన్నారు ?

అవ: ఏమబ్బాయీ, ఏమిటీమాటలు ? పెద్దా, పిన్నా తెలియకుండా ?

సీత: అబ్బాయీ, నీకు దుడుకుతనం ఎక్కువవుతున్నాది సుమా !...రండీ, అవధానులుగారూ, కూచోండి, పిల్లవానితో ఏమిటి ?......కమలా, ఏదేఒకపాట, అవధానులుగారు వింటారు !

(రాగమ్మ ప్రవేశం, పెళ్లికొడుకు రంగారావుతో.)

రాగ: రా, నాయనా, ఇలారా ; ఇక్కడకూచో.—ఇదిగో నర్రా, పెళ్లికొడుకు ! కమలా, చూచుకో అమ్మా, తరవాత వద్దనేవు !

రామా: అమ్మా, నా కెమేరా(Camera)ఎక్కడ పెట్టినావే; ఇదిగో ఇక్కడే ఉంది. (ఎదురుగా చూపుతూ) "Steady please" స్టెడీ, ప్లీస్.

సుబ్బా: అబ్బాయీ, ఈకుండగాలు కట్టిపెట్టు-ఇంటికి పెద్ద మనిషివస్తే, ఇట్లాచెయ్యడం బాగుండదు......నాయనా, రంగారావూ, ఏమీ అనుకోకు. మా వాడు బావమరదిహాస్యా లారంభించినాడు.

రంగా: అబ్బే, నేనేమీ అనుకోను. నాకున్నుహాస్యాలంటే సరదావే.

సుబ్బా: అయితే, మాగుంపులో కలిసినా వన్నమాటే.

రాగ: సుబ్బా, రంగడెవరనుకొన్నా వేమిటి? మనకు

చాలాదగ్గర. మాఅమ్మమ్మ అల్లుడికి రంగని-అత్త-మనుమరాలు రెండో పెండ్లాము.

సీత : చాలాదగ్గర సంబంధమే!

రామా : (వేరే) అవధానులుగారూ, ఈపెండ్లికొడుకు తల-రుమాలు ఆయనదేనా?

రంగా : ఆ, నాదే!

రామా : వ్రేళ్లకు పెట్టినఉంగరాలు మాత్రమాయనవి కానట్లు తోస్తుంది.

రంగా : ఎవరన్నారు? అచ్చంగానావే! నవనాగరికం కాదని చేతికాపులు, మురుగులు చెడగొట్టించి మొన్ననే చేయించుకొన్నాను.

సుబ్బా : రామూ, ఏమిటిరా ఆమాటలు? అవధానులుగారూ, గణాలుసరిపడతాయో, లేదో, చూడండి.

అవ : సరిపడక ఏమిచేస్తవి? సరిపడకపోతే, నేనుసరిపెడతా.

రాగ : అవధాను లంతటివాడెను. గ్రహాలతనిని చూస్తే హడలెత్తుతాయి.

రామా : అవధానులుగారూ, ఇంతజ్యోతిశ్శాస్త్రం చదువుకొన్నామంటారుగదా! గ్రహాలెన్నండీ?

అవ : నన్ను వేళాకోళం చేస్తావమయ్యా!

రామా : నాకుతెలియదు, చిన్నవాణ్ణి, కొంచెంచెప్పుదురూ?

అవ : తొమ్మిది.

రామా : అహ్హాహ్హాహ్హా !

అవ : నవ్వుతావేం? ఎన్నంటావు?

రామా : పదీ.

అవ : పదో గ్రహమెక్కడుందయ్యా? మాశాస్త్రాలో లేదు. మీాయింగిలీసుశాస్త్రంలో ఉంఘుందేమో!

రామా : (రంగని చూపుతూ) అదుగో, ప్రత్యక్షం!

రాగ : ఏమిరా, రాముా, పెంకెనాగమ్మా!

రామా : అయితే, బావా! ఈసూటు, ఈకోటు, అహ్హాహ్హా! ఎంతబాగున్నాయి! కాని వీటిలోమునిగిపోయినావు. కొంచెంబిగువుగా కుట్టించుకోలేకపోయినావా?

రంగా : మేము పల్లెటూరివాళ్లం, మీారుపట్నవాసంవాళ్లు, మీాపోకులు మాకెట్లావస్తాయి?

రామా : బావగారూ, ఒకపాటపాడండి.

రంగా : నాకు మీా సరిగమలపాటలు రావు.

అవ: (పాడవద్దని సైగచేస్తున్నాడు.)

రామా : సరిగమలు లేకపోతేనేం? ఒకటిసెలవివ్వండి.

రంగా : (పాడుతున్నాడు.)

'సీతారామస్వామీా, నే చేసిన నేరంబేమీా ?

రామా : మాఅవ్వదగ్గర నేర్చుకొన్నట్టున్నారీపాట.

రాగ : ఏమిరో, నాపాట నాక్షేపిస్తావా? నేనుపాడినట్లైవరు

పాడతారో రమ్మన్నను,అయ్యో! మాకాలపుపాటలు మాతోనేసరి!

కమల : ఏదవ్వా, ఒక పాట !

రాగ : పెండ్లిపాటపాడనా ?
'సీతమ్మకప్పుడు-సింగారములు చేసి
చెలికత్తె లపుడొచ్చిరి.
మాఅమ్మ సీతమ్మ మంచిపుణ్యముచేసె
రాముడూమగడయ్యెను.
పెళ్లిపీటలమీద-పేరటాళ్లప్పుడు
సీతారాములనుకూర్చో బెట్టిరి.

(అందరూ నవ్వుతారు)

రాగ : నవ్వకోండి, నవ్వకోండి. మాపాటలు మీకు రుచి స్తాయా ? రంగా, అదిగోరా, పెండ్లికూతురు. బాగా చూచుకొన్నావా?

రంగా : (సిగ్గు పడతాడు.)

రాగ : అయ్యో, సిగ్గుపడతావేమిరా? మగాడివికావ్రా? (మొగమెత్తుతూ)చూడు బాగా. తరువాత చక్కనిది కాద నేవు!

విశ్వ : ఈ అబ్బాయికి కమల నిస్తారా? నాకు తెలియ లేదు.

సీత : మాకుమాత్రం తెలుసునా యేమిటి? మాఅత్తగా రూ ఆయనా తీసుకవచ్చినారు. చూడవే, కమలా, బాగున్నాడు!

రంగా: అవధాన్లుగారూ, ఏహో నాలుగుమాటలు మాట్లా డండి, పోదాము.

అవ: తొందరపడతావే మబ్బాయీ?

రామా: బుచ్చబ్బాయి, కూచబ్బాయి! ఎన్నేళ్లుంటాయో ఈయనకు?

రాగ: ఎన్నేళ్లుంటాయి? నాకళ్లముందరపుట్టినవాడు!

రామా: మానాన్నకూడా నీకళ్లముందర పుట్టినవాడే.

రంగా: నాకు మొన్ననే 25 దాటి, 26 లోపడింది.

రామా: 25, 26; తిరగేస్తే సరిపోతుంది.

సుబ్బా: అవధానులూ, జాతకాలుచూడు. ఎందుకీ వృథా కాలహరణము? ఇవిగో జాతకాలు.

అవ: (చూస్తూ) కమలమ్మది ఆశ్లేషా నక్షత్రం, అత్తగారి గండం. కాని రంగారావుకు తల్లిలేదుగనుక ఆ అనుమానమేమిన్ని ఉండనక్కరలేదు. పంచగ్రహ యోగం. ఇది మహారాజయోగం. కమలవిష యంలో ఇది మహారాణీయోగమన్నమాట.

సీత: అతగాని జాతకం చెప్పండి.

రామా: విశ్వనాథయ్యగారూ, మీకుకూడా జ్యోతిష్యంలో ప్రవేశముందికదా. మీరుచూడండి.

విశ్వ: (చూచి పెదవి విరుస్తాడు.)

సుబ్బా: ఏమండీ, అట్లా పెదవి విరుస్తారు?

విశ్వ: ఈజాతకునికి వాక్స్థానములో శని ఉన్నాడు.

రంగా: ఏమిటండీ అంటున్నారు?

రాఘ: నీమాటకాదోయ్, పెళ్లికొడకా!

విశ్వ: విద్యాస్థానములో అంగారకుడున్నాడు! దగ్ధయోగం

అవ: ఎక్కడయ్యా నేర్చినావు జ్యోతిష్కం?

విశ్వ: నువ్వెక్కడయ్యా నేర్చినావు, దలారీబేరం?

అవ: సుబ్బారావుగారూ, ఇదేమిన్ని బాగులేదు. చూడండి, ఎట్లాఅంటాడో ఈయన!

రామా: అవధాన్లూ, ఈసంబంధం కుదర్చడానికి—

అవ: వ్యవహారమేమిన్ని సరిగాలేదు. అదృష్టంలేకపోతే నెవరేమి చేసారు?

రామా: ఎవరికి అదృష్టం?

అవ: నూరెకరాల పొలం. లక్షరూపాయలఆస్తి! తల్లీ, తండ్రీ, తోడబుట్టువులు, ఎవ్వరున్నులేరు. ఒంటరి మనిషి. ఇటువంటి సంబంధం ఎంతతపస్సుచేస్తే లభిస్తుంది?

సుబ్బా: అవధానులుగారూ, కోప్పడకండి.

అవ: ఇంకా యేంకోప్పడడం? నాలుగింగిలీసుముక్కలు నేర్చుకొనేసరికి ఎక్కడలేనినీలుగున్ను! మారంగన్న మాత్రమింగిలీసు నేర్చుకోలేదా? 'పేమిలీ'(Primary) పేసయినాడు. చట్టిపిక్కట్టుకూడాడుంది. మాఅగ్రహారంలో ఆపాటి చదువుకొన్నవాడెవ్వడున్ను లేడు.

సీత : అవధానులుగారూ, మీబిడ్డ పెండ్లికానిది ఉంది కదూ! ఆపిల్ల నివ్వకూడదూ, ఈ యనకి? మా కమల కప్పుడే పెండ్లాడడ మిష్టములేదు.

అవ : అవునండీ, సుబ్బారావుగారూ? ఏమమ్మా, రాగ మ్మా? ఇందుకా పిలిపించినారు?

రాగ : వీళ్ల కేమితెలుస్తుంది? గుడ్లయినా తెరవనివాళ్లు. ముహూర్తం పెట్టవయ్యా, అవధానులూ!

కమల : అమ్మా, దాహంవేస్తున్నది. కొంచెం నీళ్లుతాగి వస్తానుండు. (పోతుంది)

రామా : కమలా, నేనుకూడా వస్తానుండు (పోతారు.)

రాగ : ఇదుగో కమలా, వంటింట్లో జొరబడి మడుగు నీళ్లు తాకేవు సుమా.

సీత : నేనుపోయి నీళ్లిచ్చివస్తాను. (పోతుంది)

రాగ : అయ్యో, వీళ్లిద్దరున్నుపోయి, రాత్రికి నాకు నీళ్లు లేకుండా చేస్తారుకాబోలు (పోతున్నది.)

అవ : ఏదోమాటచెప్పి వెళ్లిపో, రాగమ్మా!

రాగ : ఉండవధానులూ! రాత్రికి నీళ్లులేకచావాలి! (పోతుంది)

విశ్వ : నేను సెలవుతీసుకొనివస్తాను. అవధానులుగారూ, సెలవా?

అవ : వెళ్లవయ్యా, పెద్దమనిషివి!

విశ్వ : చిత్తం! చిత్తం! (పోతాడు)

రంగా : ఏమండీ, ఒక్కరొక్కరే జారిపోయినారు !

అవ : సుబ్బారావుగారూ, పెద్దమనుష్యులను పిలిపించి, యిలా అవమానించడం భాగుండదు. ఏదోమాట చెప్పండి.

సుబ్బా : అవధానులుగారూ, మీరు మరోలాగ అనుకోకండి. రంగారావూ, నువ్వు నీమనస్సులో ఏమిన్ని ఉంచుకోకు, నాయనా, నువ్వు వెళ్లు, మా అమ్మతో ఆలోచించి, ఏదిన్ని జాబు వ్రాస్తాను.

(తెరలో : నాన్నా, డిప్టీకలెక్టరుగారు వచ్చినారు.)

సుబ్బా : ఆఁ ! ఆఁ ! వస్తున్నాను. (పోతాడు)

రంగా : ఏమి, అవధానులుగారూ, ఏమిటిది ?

అవ : ఏమీ లేదోయ్. నీవు బెంగపెట్టుకోకు. కుదిర్చేవాణ్ణి నేనున్నానుకదూ. వీళ్లు చిన్నహాస్యం చేసినారు. నిన్నుచూస్తే అందరికీ యిష్టమయినట్టే నేను గ్రహించినాను. రా చెప్తాను.

రంగా : భోజనానికయినా ఉండమన్నారు కారు !

అవ : నీకెప్పుడున్ను భోజనంగోలే ! కతుకుతే అతకదని నీకు తెలియదు. రా, ఇంటికిపోదాము. (పోతారు)

# రంగము 3.

(ప్రవేశము: రామారావు, మోహనరావు, సంజీవరావు.)

రామా: మోహనా, ఎప్పుడురాక?

మోహ: ఈ ఉదయమే వచ్చినాను. మీనాన్నా, అవ్వా, బాగున్నారా?

రామా: బాగా నేఉన్నారు. ఈపిల్లవాడెవరు?

మోహ: నారూమ్-మేటు పద్మనాభరావుతమ్ముడు.

రామా: పద్మనాభరావంటే, నంద్యాలలో...

మోహ: అవును, వాడే. అయితే, రామూ, మనమిక్కడ కాలేజిలో చదువుకొంటున్నప్పుడు, నాటకాలాడేవాళ్లము, వెంకటసుబ్బయ్య, నరసింహప్ప, వారందరి పేళ్లు మరచిపోయినాను, వాళ్లెక్కడెక్కడున్నారో!

రామా: ఎక్కడెక్కడో ఉద్యోగాలలో ఉన్నారు. కొందరు నిరుద్యోగ డిపార్టుమెంటులో వాలంటరీ చేస్తున్నారు.

మోహ: ఈసెలవలలో ఏదయినానాటకం తయారుచేసి ప్రదర్శించాలి, కాలమెట్లో వెళ్లబుచ్చాలికదా !

రామా: ఇక్కడి వాళ్లెవ్వరికిన్ని నాటకాలమీదఅభిరుచి లేదు. పురాణకథలమీద మోజుపోయింది, పాటలూ, పద్యాలూ, గ్రామఫోను రికార్డులలోనికెక్కి, వేళాకోళంక్రింద దిగాయి. గ్రాంథిక భాషలో వ్రాసిన నాటకాలంటే, ఎవ్వరికిన్ని సరిపడదు, వ్యావహారిక

భాషలో వ్రాస్తే, ప్రతీవాడున్ను పండితుడనని తల తిప్పేవాడే, గద్యనాటకాలాడదామంటే, పద్యాలు కావాలంటారు. పద్యాలున్న నాటకాలాడితే, 'ఛీ, పద్యాలేమి' టంటారు, ఇట్లాఉంది . మన నాటకరంగస్థితి, సినీమాలువచ్చి నాటకాలను అణగ ద్రొక్కాయి.

మోహా : నువ్వే అట్లానిరుత్సాహపడితే ఎట్లా? నేనొక క్రొత్త రకం నాటకం వ్రాయించుకొనివచ్చినాను. ఈసంజీవ రావును అందుకోసమే నావెంటతీసుకొని వచ్చింది. ఏ డేవేషానికంటే ఆవేషానికే అమరిపోతాడు.

రామా : నీనాటకముమాట కేమిగాని, ఒకనిజమైన నాటక ములో మనము పాత్రలము కావలసిఉంది. ఈసంజీవ రావు మనరహస్యం కాపాడుతాడా?

మోహా : అందు కేమిన్ని భయములేదు ఏమిరా, సంజీవా! ఓ!

సంజీ : ఇటువంటివెన్ని నాటకాలాడినానో ! కథయేమిటో చెప్పి, నాపాత్రనాకు నిర్ణయిస్తే తక్కినది నేను చూచుకొంటాను.

రామా : నువ్వుచూచుకొంటే పనికిరాదు. నీపార్టు గట్టిగా కంఠస్థంచెయ్యాలి,క్లూస్ (Clues) తోకూడా. ఏపాటి తప్పినా నాటకమంతా రసాభాస అవుతుంది.

సంజీ : మీరేమీ భయపడకండి.

రామా : అయితే చెప్పుతాను, బాగావినండి. నాచెల్లెలు కమల చెన్నపట్నంలో చదువుకొంటున్నది.

మోహ: అవును, నాకు తెలుసును. మాలాడ్జిప్రక్కనే కమల లాడ్జికూడాను. ఇప్పుడిక్కడనే ఉందికదూ?

రామా: అవును, ఉంది. దానిని రంగన్న అనే ఒకపల్లెటూరివానికిచ్చి పెండ్లిచెయ్యవలెనని మానాన్న, అవ్వ, తలపెట్టినారు.

మోహ: ఆసంబంధం నీకూ కమలకూ యిష్టంలేదన్నమాట స్పష్టమవుతూనేఉంది.

రామా: మాఅమ్మకుకూడా యిష్టంలేదు.

మోహ: అయితే మరీమంచిదే. కాని, రంగనికేఇవ్వవలెనని మీనాన్నకు పట్టుదల ఎందుకు ?

రామా: వానికి ఆస్తి ఉన్నదట.

మోహ: వయస్సు?

రామా: నలభైదాటి ఉంటుంది.

మోహ: సరే, అయితే ఆసంబంధం తప్పించవలెనని నీ అభిప్రాయం ?

రామా: కొంతవరకు వానికి శృంగభంగం చేసినాము. కాని, అంతటితోకుదురదు. మాఅవ్వపట్టుపట్టితే, మా యింట్లో గృహచ్ఛిద్రాలారంభమవుతాయి.

మోహ: అయితే, ఏమిటి నీపన్నాగము ?

రామా: శ్రద్ధగా విను.

(తెరలో : "అన్నయ్యా !")

అనుగో కమలవస్తున్నది. ఇప్పుడొద్దు.

నువ్వెసో, సాయంత్ర మాలోచించుకొందాము.

(కమల ప్రవేశించి మోహనరావునుచూచి సిగ్గుతో వెనుకకు పోతున్నది.)

మోహ : రా, కమలా, భయము లేదు.

రామా : మీయిద్దరికిన్ని ఇంతకుముందు పరిచయమున్నదా?

మోహ : పరస్పర గౌరవమున్నది.

రామా : కమలా, భయము లేదు, రా. ఇక్కడఉన్నది మరెవ్వరున్నుకాదు. మోహనరావు.

(కమల ప్రవేశము.)

మోహ : కమలా, సెలవలకు పట్నంలోనే ఉంటానని చెప్పినావే!

కమ : మానాన్నరమ్మని ఉత్తరమిచ్చినాడు.

మోహ : నీపెండ్లికోసమని రాము ఇప్పుడే చెప్పినాడు. నీకు నా అభివందనాలు.

రామా : హాస్యాలమాట అటుంచి, కమలనుకూడా మన ఆలోచనలోనికి చేర్చుకొందాము.

మోహ : చేర్చుకొంటేనే రక్తి కట్టేది.

కమ: అన్నయ్యా, ఏదో పెంకెతనం చెయ్యడానికి తలపెట్టినట్టుంది.

రామా: గట్టిగా అనకు, పైకిపొక్కితే అంతా చెడిపోతుంది.

కమ: ఏమిటో చెప్పు.

(సీతమ్మ ప్రవేశము.)

సీత: కమలా, నీకోసం ఎంత సేపటినుంచో వెతుకుతున్నాను—ఇదెవరు? మోహనరావా? ఎప్పుడొచ్చావోయ్?

మోహ ఈ ఉదయమే వచ్చాను, మిమ్మలినందరినీ చూచిపోదామని.

సీత: మోహనుకు చిన్నప్పటినుంచిన్ని మామీద అభిమానం.

రామా: మా అమ్మనుకూడా మనఆలోచనలోనికి చేర్చుకొందామా?

మోహ: అయ్యో, ఆమె లేకపోతే ఎల్లా?

రామా: అయితే వినండి, కమలను రంగని కివ్వడమేమో ఉత్తమాట. వానికి నలభై యేళ్లు దాటినవి. ఎద్దు మొద్దుస్వరూపం. దుడ్డుంటే వానిమొహాన్ని కొట్టుకోనీ. కాని,వానికి పెండ్లిపిచ్చి పట్టుకొన్నది. ఆపిచ్చి వదలగొట్టాలి.

కమ: ఏమిచెయ్యాలనుకొన్నావు ?

రామా: వానికిపెండ్లి చేయిస్తాను.

మోహ: పెండ్లికూతురో?

రామా: ఈసంజీవరావు.

ీత : పెంకెనాగమ్మా, మొగాడికి మొగాడికి పెళ్ళిచే స్తావటరా !

రామా : మగవాడు మగదానిని వలవడం, ఆడది ఆడదానిని వలవడం, ఈనాడుపుట్టినదికాదు. చేమకూరవా డేమన్నాడు? 'మగవానికి మగవాడును, మగువకు మగువయునువలచు మారియేమన నీ,నగరపురాజకొ మారుల జిలిబిలిపోయగము చెలుల సింగారంబున్' అన్నాడు.

మోహ : ఏమిరా, సంజీవా, ఏమంటావు ?

ంజీ : ఓ! సిద్ధం !

రామా : మా అమ్మకు, కమలకు ఇష్టమయితే మరొక పెండ్లికూడా చేయించవలెనని నాకు సంకల్పం పుట్టింది.

మ : ఇలాంటి పెళ్ళిళ్లు కుదర్చడం ఎక్కడ నేర్చుకొన్నా వురా, అన్నయ్యా !

రామా : ఇంగ్లీషు వాఙ్మయ మింకా నువ్వు బాగా చదువ లేదు. చదువుతే జీర్ణించుకోలేదు. అందుకోసమే నువ్వు ఇంగ్లీషు ఆనర్సు ప్యాసయేదాకా చదువుకో వాలి.

ీత : అయితే నువ్వు తలపెట్టిన రెండో పెళ్లి యెవరికి ?

రామా : ఇక్కడనే ఉన్నారు దంపతులిద్దరున్ను.

(కమల, మోహనరావు, సిగ్గునటిస్తారు.)

రామా : అమ్మా, చూచావా, తెలిసిపోయిందా ?

సీత : తెలిసింది. కాని, కుదరడమెట్లా ?

రామా : నేను కుదురుస్తానుకదూ. అయితే దీనిలోచాలా సాహసమూ, నేర్పూ, కావాలి. ఈనాటకములో పాత్రధారులందరున్ను గడితేరినవారై ఉండాలి. ఈ పన్నాగం రవ్వంతబయటికి వచ్చిందంటే, అంతా చెడిపోతుంది.

సీత : అయితే యేమిచేయమంటావు ?

రామా : నాన్నకు, అవ్వకు తెలియకుండా కమల ఈ సాయంత్రమే బయలుదేరి, మగవేషంతో చెన్నపట్నం వెళ్లిపోవాలి. అక్కడ కమలాకరరావనేపేర మగవేషం ధరించి ఉండాలి. ఒక నెల్లాళ్లవఱకు కాలేజీకి పోకూడదు. ఎటెండెన్సు భయమేమిన్ని లేదను కొంటాను.

కమ : నాకు కావలసినంత ఎటెండెన్సున్నది.

రామా : మోహనరావు, సంజీవరావు, వెంటనే, ఇప్పుడున్నట్టుగా ఆడపిల్లలు కావాలి.

మోహ : అది ఒక పెద్దపనికాదు.

సీత : వేషానికి అమర్చి అన్నీ తెస్తానుండండి. (పోతుంది.)

రామా : మోహనరావూ, నీసూటుకేసులోని సూట్లు, షర్టులు, సాక్సు, టైలు, అన్నీ యిట్లాయిచ్చీ.

(మోహ : ఇస్తున్నాడు.) కమలా, పోయి, తొడుక్కొనిరా.

ఇంద (ఇస్తున్నాడు.) ఉండు, జుట్టుభయములేదులే. బాబుచేసి ఉంది (కమలపోతుంది)

మోహ : నాకుచిన్నమీసం వస్తున్నదే. ఇదెట్లాదాచుకోడం?

రామా : భయములేదు. బాగాకనబడదులే. కొంతమంది ఆడవాళ్లకట్లాగే ఉంటుంది.

సంజీ : అయితే, మాపాట్రేమిటో తెలియలేదు.

రామా : చెప్పుతానుండు, వాళ్లిద్దరున్నారానీ.

(మగవేషముతో కమల ప్రవేశము.)

రామా : ఇవిగో, ఈకళ్లద్దాలు తగిలించుకో. బాగుందివేషం. చిన్నమీసం తగిలిస్తానుండు. (అంటిస్తున్నాడు.) భేష్‌గా ఉంది.

(సీత : చీరలు మొ॥ పట్టుకొని ప్రవేశము.)

రామా : ఏమిమోహనా, చీరసింగారించుకోడం వచ్చునా?

సంజీ : నేనుసవరిస్తా నిలార్చండి. (పరిక్రమిస్తారు.)

సీత : రాముా, పెంకెవాడా, ఎంతతమాషాచేస్తున్నావురా.

రామా : తమాషాచెయ్యకపోతే కార్యాలెట్లవుతాయమ్మా!

సీత : రాముా ఈపిల్లవాడెవరు?

రామా : ఇతడు కమలాకరరావు, నాస్నేహితుడు. చిన్నప్పటి నుంచీ కలసి ఆడుకొంటూ, ఒక్కబడిలో చదువుకొన్నాము.

సీత : రామూ, ఇటువంటి పిల్లవాడు మనకమలకు మగడ యితే యెంత బాగుండునురా!

కమ : (నవ్వుతున్నది.)

రామా : ఇదుగో, కమలాకరరావ్, నవ్వుతున్నావు, భద్రం! నీకుమాకమలనిచ్చేసినట్లే కులుకుతున్నావే.

కమల : (అద్దంఎదుట నిలుచుండి సవరించుకొంటున్నది.)

(మోహనరావు, సంజీవరావు, ఆడవేషముతో ప్రవేశము.)

(రామారావు, కమల, సిగ్గునభినయించి వెనుకకుపోతున్నారు.)

రామా : అమ్మా, ఎవ్వరోఆడపిల్లలు వచ్చినారు. చూడు, నాకుపనుంది, పోతాను. కమలాకరరావ్, రావోయ్, పోదాము.

సీత : రండమ్మా, రండి, కూర్చోండి. (కూర్చుంటున్నారు.) మీది వూరేనా? ఎప్పుడున్ను చూచినట్లులేదు.

మోహ : ఏమోయ్, రామారావు, మాకుగాజులుతొడిగించి, ఏమిచెయ్యడమో చెప్పకుండా, చల్లగాజారిపోతున్నావు!

రామా : ఓస్, ఇంతేనా, మీసమయస్ఫూర్తి? అయితే అందరున్ను దగ్గరగారండి, ప్లాటంతా సంగ్రహంగా చెప్పుతాను.

(అందరున్ను దగ్గరగాచేరుతున్నారు.)

మోహనమ్మ, సంజీవమ్మ, మీరిద్దరున్ను అక్కచెల్లెళ్లు, మాఅవ్వ పినతండ్రికొడుకుకు మనుమరాళ్లు. మాఅవ్వ పినతండ్రి

పేరు ప్రకాశరావు, అతనికొడుకు పేరు కుటుంబరావు, అతని కొడుకు మీ తండ్రి;- పేరు విశ్వపతిరావు. ప్రకాశరావు రాయ వేలూరిలో ఉద్యోగంచేస్తూ, అక్కడనే యిల్లూవాకిలీ సంపాదించినాడు. అతని సంతానములో మీ యిద్దరు మాత్రము మిగిలినారు. మీ తల్లిదండ్రులు రెండు నెలలయి చచ్చిపోయి నారు. ఆస్తి అంతా అప్పులవాళ్ల పాలయింది. మీ అవ్వ ఇక్కడ ఉన్నదని తెలుసుకొని, వెదకుకొంటూ ఇక్కడకు వచ్చినారు. జ్ఞాపకముందా, కథ ?

(రాగమ్మ, ప్రవేశము.)

రాగ : ఏమరాా, ఏమిచేస్తున్నా రిక్కడ? వీళ్లెవరు ?

మోహా : సంజీ: (ఏడుపు నటిస్తున్నారు.)

రాగ : ఎవరమ్మా మీరు ? ఎందుకేడుస్తారు ?

మోహా : సంజీ: అవ్వా ! (అని యేడుస్తారు.)

సీత : పాపం, చిన్నవాళ్లు, దిక్కుమాలిన వాళ్లయినారు.

రాగ : ఎవరు వీళ్లు ?

సీత : మీ పినతండ్రికొడుకుకు మనుమరాళ్లట. విశ్వపతి రావు కూతుళ్లట.

రాగ : అవును, మావిస్సడు రాయవేలూరిలో ఉన్నాడని విన్నాను. ఏమమ్మా! మీఅమ్మా, నాన్నా, బాగు న్నారా?

మోహా : సంజీ : (ఏడుస్తున్నారు.)

రాగ : ఏమర్రా, ఏడుస్తారు?

సీత : పాపం, వాళ్లమ్మా, నాన్నా, ఒక్కనాడేవచ్చి పో యినారట.

రాగ : అయ్యో, నా విస్సూ! (ఏడుస్తున్నది.)

మోహ : అవ్వా, యీలోకములో దిక్కుమాలిన పక్షులమయి నాము. అవ్వా, నువ్వుతప్ప మాకు మరెవ్వరున్న లేరు.

రాగ : భయపడకండమ్మా! మిమ్మల్ని నాకడుపులో పెట్టు కొని పెంచుకొంటాను. నాకొడుకొకటీ, మీతాడ్రి ఒకటీకాదు. మాకమలకంటే మిమ్మలి నెక్కువగా చూస్తాను. నాదగ్గరనే ఉండండి. మీరు నావద్ద నె న్నాళ్లుండాలి? మంచిసంబంధం వస్తే చూచి పెండ్లి చేసేస్తాను. ఆ తరువాత మీరూ మీమొగుళ్లూ కాపురం చేసుకొంటారు.

మోహ : అవ్వా, నీఋణ మెట్లా తీర్చుకోగల మవ్వా !

(కంట తడిపెట్టుతారు.)

రాగ : సీతమ్మా, పిండ్లను నీకూతుళ్లలాగు చూచుకోవాలి. వీండ్లు నీకు దగ్గరకాకపోయినా, నాకున్న నా కొడుకుకున్న అయినా దగ్గర వాండ్లు కదా.

సీత : భయపడకండమ్మా. లోపలికి రండి.

రాగ : రండమ్మా. రామూ, వీండ్ల పెట్టెలూ సామానులూ

లోపల పెట్టించు. వీండ్లను సుబ్బుకు చూపిస్తాను. (సీతమ్మ రాగమ్మ,మోహనరావు,సంజీవరావు,పోతారు.)

రామా : కమలా, నీవిప్పుడే రైలెక్కి పో. పోన్నీ, యెందుకులే. ఉండు. అవధానులు వస్తున్నాడు. తమాషా చేస్తాను. వాండ్లయింట్లో ఉందువుగాని.

కమల : అంతా బయలుపడుతుందేమో!

రామా : ఏమీ బయలుపడదు. గుంభనగా ఉండు.

(ప్రవేశము: అవధానులు)

రామా : అవధానులుగారూ, నమస్కారము.

అవ : దీర్ఘాయుష్యమస్తు. సకలకల్యాణ పరంపరావాప్తిరస్తు.

రామా : నేను మాఅవ్వతో హాస్యాలాడబోయి, తమరినేవో మాటలన్నాను. నన్ను క్షమించాలి.

అవ : దానికేమిలే, నాయనా, నువ్వుబుద్ధిమంతుడివి. నీసంగతి నాకు తెలియదూ? అయితే, మీఅమ్మా, నాయనా, కమల వివాహముమాట యేమనుకొంటున్నారు?

రామా : రంగారావు కివ్వాలనే అనుకొంటున్నారు. నేను కూడా అతనికే యిచ్చితీరాలని పట్టుపట్టినాను. వాళ్లు నిశ్చయం చేసుకొన్నారు. ఈదినమే రంగారావుకు జాబువ్రాస్తారు.

అవ : చాలా సంతోషం. నాపరువు దక్కుతుంది.

రామా: నాదొక్క మనవుంది. చెల్లిస్తానంటే చెప్పుతాను.

అవ: దానికేమి నాయనా, చెప్పు. తప్పకుండా చేస్తాను.

రామా: ఇదిగో, ఈయన నాస్నేహితుడు, నెల్లూరినుంచి వచ్చినాడు. జమీందారీ కుటుంబము. కనిగిరి తెలుసును కదూ?

అవ: తెలియకేం?

రామా: ఆఊళ్లో ప్రస్తుతం కాపురం.

అవ: అయితే ఈయన యిక్కడికి రావడానికి కారణం?

రామా: మాయింటికి రాయనేలూరినుంచి మాఅవ్వ-పిన తండ్రి మనుమరాళ్లిద్దరు వచ్చినారు. వాళ్లకెవ్వ రున్న దిక్కులేరు. వాళ్లలో పెద్దదానిని పెళ్లాడ వలెనని ఈయనకుంది. నేనుచెప్పితే మానాన్న వినడు. మీరంటే పరమగౌరవం.

అవ: పిల్లదాని కిష్టమేనా?

రామా: ఇష్టమే.

అవ: అయితే అదెంతమాట? మూడునిమిషాల్లో కుదురు స్తాను.

రామా: కుదిరిస్తే వెయ్యిరూపాయ లీపిల్లవానిచేత మీకు ముట్టజెప్పిస్తాను.

అవ: అబ్బెబ్బెబ్బె! అటువంటి ఆశలకు పోయేవాడను కాను. ఏదో ఆవిషయములో నువ్వున్నావు చాలులే.

రామా : ఈవూళ్లో యితని కెవ్వరున్నులేరు. మాయింట్లో ఉండమంటే, ఉండనంటాడు. కతుకుతే అతకదం టాడు. ఈపెండ్లి అయేదాకా మీయింట్లోఉంచు కోవాలి. మీఋణం ఉంచుకోము లెండి.

అవ : ఈయన పేరు?

రామా : కమలాకరరావు.

అవ : ఇంకేం! మీకమలపేరే! నాకు మీకమల ఒకటిన్ని కమలాకరరావు ఒకటీనా? ఇద్దరి పెళ్లిళ్లున్ను ఏక ముహూర్తంలో చేయించేదాము. కమలాకరరావు గారు మాయింట్లో ఆతిథ్యం స్వీకరించాలి. మేము పరాయివాళ్లము కాము.

రామా : అవధానులుగారూ! ఇతడుచాలా మొగమోటస్థుడు, మితభాషి. ఆయన కేమికావాలో మీరే తెలుసుకొని చేయించాలి.

అవ : రాజపూజితంగా జరిపిస్తాను. అవధానుల నయినా తొక్యములో పెరిగినాను. దయచెయ్యండీ, కమలాకరరావు గారూ!

రామా : కమలాకర్, ఏమిన్ని మొగమోటం పడకు. అవధానులుగారు మనవారే. (పోతారు)

# రంగము. ౪.

(సుబ్బారావు కూర్చున్నాడు.)

**సుబ్బా:** నేనేమిచేస్తాను? నాయత్నమేముంది? ఎలెక్షనుల గొడవలోపడి ఇరవైవేలప్పుచేసినాను. ఆస్తులు చాలామట్టుకు కుదువబెట్టినాను. ఎక్కడాఒకబొట్టు (డబ్బు, కాసీ) వచ్చే ఆస్కారము కనబడదు. ఇంటికెంతోమంది వచ్చిపొయ్యేవాళ్లు. మా రామారావు అనరుస్ పాసయి యింట్లోకూర్చున్నాడు. ఇంకా బి. యల్. చదువుతానంటాడు. కమల అనరుస్ ఇంకా మొదటి యేడు. 'చదువు వద్దమ్మా, ఆడపిల్లలకు చదువెందుకు?' అని యెంతచెప్పినా, వినదు. దానికి తల్లీ, అన్నా, సహాయం. "ఆ రంగారావుకిచ్చి పెండ్లిచేస్తే, ఒంటరిగాడు, ఎక్కువ ఆస్తి పాస్తీ ఉంది, నాబరువు కొంతసరకున్ను తీరుస్తాడు," అని సంబంధం కుదుర్చుదామంటే, ఇంట్లో మాఅమ్మకుతప్ప మరెవ్వరికిన్ని యిష్టములేదు. బలవంతంగా ముడిపెడదామా అంటే, ఈచదువు కొన్నవాళ్లు ఎంతటికయినా తెగిస్తారు. ఈపెండ్లిమాటయెత్తిన దగ్గరనుంచిన్ని కమల నాయెదుట పడడమే మానేసింది.

(ఒక తిరిపగాడు ప్రవేశము)

**తిరి:** (పాడుతున్నాడు)

"ప్రారబ్ధ కర్మము-అనుభవింపక తీర
దెంతవారికైనను-కావేటిరంగ."

**సుబ్బా:** ఎవడురా అదీ! పో, చెయ్యితెరిపిలేదు.

**తిరి:** (గొంతెత్తి)

"ఎవరెంత చేస్తారో-ఎవరెంత తెస్తారో,
అంతే వస్తుంది, అంతే తెస్తుంది-ప్రారబ్ధ."

సుబ్బా: ఎవడురా అదీ? చెప్తే వినబడదూ?

తిరి: (ఇంకా గొంతెత్తి)
"చచ్చేటప్పుడు వెంటరాదు ఒక-పుచ్చినవక్కయినా,
మోసముచేస్తే మోసంవస్తది-ముందు చూడరన్నా-చచ్చే."

సుబ్బా: శకునాల దయ్యం, శాపాలదయ్యం దాపరించింది. ఉండురా, మరిపాడకు, తిరిపమేస్తాను.

తిరి: (వినిపించుకోకుండా)
"ఆలుబిడ్డలను ఆదరించక-ఆత్మలాభమునె కోరి
అవక తవకగా తిరిగేవారికి-అంతే! అంతే! అంతే!
అంతే! -చచ్చే"

సుబ్బా: (లోనికిపోయి బిచ్చము తెచ్చి వేస్తూ)
నువ్వు మరెప్పుడున్నూ మాయింటికి రాకు. వస్తే కాళ్లిరగగొట్టిస్తా.

తిరి: ధర్మమే వర్ధిల్లాలి! "ప్రారబ్ధ కర్మము" అనిపాడుకొంటూ పోతాడు.!

(సీతమ్మ తొందరగా ప్రవేశిస్తుంది.)

సీత: ఏమండీ! ఏమండీ! నిన్న ఉదయంనుంచిన్ని కమల కనబడడము లేదు.

సుబ్బా: ఆఁ! ఆఁ! ఎక్కడకు పోయింది?

సీత : వాండ్ల మేనమామ యింటికి వెళ్తానని చెప్పిపో యింది. అక్కడనే ఉంటుందిగదా అనుకొన్నాను. అక్కడలేదట.

సుబ్బా: అయ్యో, ఎక్కడకుపోయిందే! రాముకు తెలుస్తుం దేమో అడుగు.

సీత : రాము ఊరంతా తిరిగి వచ్చినాడండీ! ఎక్కడా కన బడలేదట.

(రామారావు ప్రవేశము.)

రామా: అమ్మా, కమల ఏదోసాహసం చేసిందే!

సీత : ఏమిచేసిందిరా? వీళ్లపెళ్లి కాలిపోనూ! ఏమయిందిరా?

రామా: దానిగదిలో తలగడకింద ఈజాబు కనబడింది.

సుబ్బా: ఏముంది, నాయనా, జాబులోనూ?

రామా: ఇదుగో, చదువుకో (ఇస్తున్నాడు)

సుబ్బా: (జాబు చదువుతున్నాడు)

"నాకెవ్వరిమీదా కోపం లేదు. నాకుమీరు చెయ్య బోయే పెళ్లి ఇష్టంలేదు. ఆడదాననై పుట్టినందువల్లగదా నాకీ అస్వతంత్రం? అందుచేత ఈ ఆడరూపం చాలించుకో దలచి నాను. కమల అనేకూతురు మీకున్నదని మరచిపొండి. నాకోసం మీరు వెతకి లాభములేదు. అట్టిప్రయత్నము చేసి శ్రమపడకండి.

మీ కుమార్తె, కమల."

సీత : అయ్యో, నాకమలా! వీళ్లందరూ కడుపులో పెట్టు కొన్నారమ్మా! నిన్ను మ్రింగేశారమ్మా! నాకేమి దారే, కూతురా!

సుబ్బా : అమ్మా, ఎంతమోసం చేసినావే? నాతో చెప్పిఉంటే నేనీ పెళ్లి తలపెట్టిఉండను గదమ్మా!

(జవాను: సార్, టెలిగ్రాం!)

రామా : (తీసుకొని) అయిందమ్మా! అనుకొన్నంతా అయిం ది అయ్యో చెల్లెలా! నువ్వు నాకు తమ్ముడవై ఉండినా బాగుండును గదమ్మా!

సీత : ఏమిటిరా, రామూ? టెలిగ్రాము చదువురా?

రామా : "Kamala drowned sea search made body missing Kantam."

సుబ్బా : కాంతమేయిచ్చినాడూ, టెలిగ్రాం? కమల నాకొంప ముంచీసిందర్రా!

(రాగమ్మ ప్రవేశము)

రాగ : ఏమిటర్రా, గందరగోళం?

సీత : ఎక్కడ దాపరించినావే, అత్తగారూ! ఎంతపని చేసినా వమ్మా!

రాగ : నేనేమి చేస్తినే?

రామా : ముసలిముండా, ఎక్కడదొరికినావే, మాకూ!

రాగ : ఎమిర్యా, అట్లాతిడతావు?

సుబ్బా : నీమాటవిని కమలను మింగేసినానమ్మా!

రాగ : ఏమయిందిరా !

సుబ్బా : కమల చెన్నపట్నంలో సముద్రములోపడి చచ్చి పోయిందటమ్మా !

రాగ: ఉత్తమాటలు, అది వాళ్ల **మామ**గారింట్లో ఉంది. చెప్పకుండా చెన్నపట్నం ఎప్పుడు వెళ్లింది? ఏమీ కనుక్కోకుండా ఇట్లా అలజడిపడతా రేమిట్రా !

సుబ్బా : లేదమ్మా, టెలిగ్రాం వచ్చింది !

రాగ : అయ్యో, టెలిక్కాపే వొచ్చింది ! నాకమలా ! నా కమలా !

సుబ్బా : నా చదువుల సరస్వతిపోయిన తరువాత, యిక నెందుకమ్మా యీ జన్మం ?

రాగ : ఏమిచేస్తాము రా, నాయనా ! దాని కాయుస్సునిండి పోయింది. దాని కీభూమిమీద యోగంలేదు. మా రంగడిని పెళ్లి చేసుకొని సుఖపడుతుందను కొన్నాను. దానికాభాగ్యము లేదు.

రామా : నీ వేదాంతం మండా ! ఇట్లా ఎంతమందిని కడతేర్చి నావే, ముసలిముండా !

సీత : బ్రహ్మదేవుడు నీకెంత ఆయుస్సుపోసినాడే, అత్త మ్మా !

రాగ : ఇట్లా తిట్టితే పడేదాన్ని కాను. ఏమిరా, సుబ్బా, ఇట్లా తిట్టిస్తావటరా ?

సీత : ఒకొక్క యింటి కిలాటివాళ్లు దాపరిస్తూ ఉంటారు. అయ్యో, నా కమలా !

రాగ : ఇట్లా అయితే, నేనీయింటిలో ఉండను. ఇదిగో పోతున్నాను.

రామా : పో, అవధాను లింట్లో చేరు. వాడు ముహూర్తాలు పెడతాడు.

రాగ : పోతానురా, నాయనా, పోతాను ! మీరంతా సుఖంగా ఉండండి ! ఏమిరా, సుబ్బా, పోతు న్నాను—వాడున్ను మాట్లాడ లేదు. ఆ ! పోవలసి నదే.

సీత : వాళ్లెవరో నీచుట్టాలని యిద్దరుపిల్లలనుకూడా తీసుకొచ్చి మామీద కొరుదులులాగ కూర్చో బెట్టినావు. వాళ్లనుకూడా తీసుకొనిపో. నేను చెయ్యలేను వాళ్లకింద.

రాగ : సుబ్బా, పోనా ?— పలకవు. వాళ్లుమాత్రం మీ యింట్లో యెందుకు ? రంగారావు మమ్మల్ని పోషించలేకపోడు. (పోతుంది.)

సుబ్బా : రాముా, ప్రేమెయిడు టెలిగ్రామిచ్చి, కమలను గురించి కనుక్కోరా.

రామా : ఏమికార్యం ? ఇచ్చిచూస్తాను.

సీత : ఏమిదారండీ? కమల నన్నెవ్వరి కొప్పజెప్పి పోయిం దండీ !

రామా : రా, అమ్మా ! ఏమీబెంగ పెట్టుకోకు.

(తెర.)

# రంగము. ౫.

(అవధానులు ఇల్లు : అవధానులు, రాగమ్మ, రంగారావు, ప్రవేశము.)

రంగా : ఏమండీ, అవధానులుగారూ, పెండ్లిమాటయేమి చేసినారు.

అవ : ఏమిచెయ్యడము, నాయనా? ఆపిల్ల దురదృష్ట వంతురాలు. నీకుభార్య అయి సుఖపడడానికి నోచుకోలేదు.

రాగ : అయ్యో, నా కమలా, ఎంతపనిచేస్తివే!

రంగా : ఆవిడ అట్లా యేడుస్తుందేమి?

అవ : ఆపిల్ల పోయింది, నాయనా!

రంగా : ఎప్పుడు?

రాగ : నేటికి నెల్లాళ్లయింది, నాయనా!

రంగా : ఆపిల్లమాటకేమి? నేను దురదృష్టవంతుణ్ణి- మరోసంబంధ మేదయినా చూడండి, అవధానులు గారూ.

అవ : రాగమ్మా, నీ యెరికను మరెవ్వరయినా యెదిగిన పిల్ల లున్నారా?

రాగ : నాపినతండ్రి మనుమరాళ్లిద్దరున్నారు. చక్కని చుక్కలు. మంచిబుద్ధిమంతురాళ్లు. వాళ్లలో చిన్నది రంగడికి ఈడూజోడుగా ఉంటుంది.

అవ : పెద్దపిల్లకు పెళ్లి కాకుండా, చిన్నదాని కెట్లా ?

రాగ : పెద్దపిల్లకు నువ్వేకుదర్చాలి.

అవ : మాయింట్లో ఒక పిల్లవాడున్నాడు. జమీందారుల కొడుకు. ఈ సంబంధాని కొప్పుకొంటాడో, లేదో.

రాగ : జమీందారీ కుటుంబమా ? అవధానులూ, ఎట్లాగో ఒక అట్లా ఈ సంబంధం నువ్వు కుదిర్చిపెట్టాలి.

అవ : నీ మనుమరాళ్లెక్కడున్నారు ?

రాగ : ఇక్కడే, నాతమ్ముడింట్లో ఉంచినాను. పిలుచుక వస్తాను. అవధానులూ, వాళ్ల కింతఆధారం చూపెట్టు, నాయనా !

(ప్రవేశము : మోహానమ్మ, సంజీవమ్మ.)

మోహా : అవ్వా, ఇక్కడనా ఉన్నావు ? నీకోసం వెతుక్కొంటున్నాము.

రాగ : ఇదుగో, తలవనితలంపుగా వచ్చినారు. ఇది శుభసూచకమే. అవధానులూ, ఇది నాపెద్దమనుమరాలు, పేరు మోహానమ్మ. ఇదిచిన్నది, సంజీవమ్మ

(సంజీ: రంగారావునుచూచి సిగ్గుపడుతుంది.
రంగారావున్ను సిగ్గుపడుతాడు.)

ఏమిరా, రంగా, ఈచిన్నది నీకిష్టమేనా ?

అవ : అట్లా మొగమెదురుగా అడుగుతే యేమిచెప్పుతాడు ?

రాగ: ఏమే, సంజీవీ, ఏమంటావు? మా రంగడు బాగున్నాడా?

సంజీ: (సిగ్గుతో) ఊరుకో, అవ్వా!

అవ: రంగారావూ, ఈ పిల్ల బాగా నేడుంది. మొగము చూస్తే, కళా, కాంతీ, కనబడుతున్నది. అదృష్టవంతుడవే. మరి పెళ్లానికి నగా, నట్రా, చీరా, చిట్రా, అంతా సిద్ధంచేసుకో. ఈ శుక్ల పక్షంలోనే పెండ్లి చేయించేస్తాను.

రాగ: రెండుప్రక్కల ఖర్చులున్నూ రంగారావువే. నగలూ, గిగలూ, వానియిష్టం. తనపెళ్లానికేకద. ఎవరున్నూ పట్టుకపొయ్యేవి కావు.

అవ: రంగారావ్, అంతావిన్నావు గదా? ఏమంటావు?

రంగా: అట్లేకానివ్వండి.

రాగ: ఏమే, సంజీవీ, నీమాట?

సంజీ: అన్నిటికీ నువ్వే ఉన్నావవ్వా. నిన్నే నమ్ముకొన్నాను.

అవ: ఇక్కడి కిది కుదిరింది. ఇక పెద్దపిల్లమాట. ఆపిల్లవానిని పిలుచుక వస్తాను. (పోతాడు.)

మోహా: అవ్వా, నేను పోతానవ్వా.

రాగ: ఇదేమే, ఇట్లా అంటావు? ఇంతసిగ్గేమిటి? జమీందారీ కుటుంబములో పడతావు. నన్నప్పుడు చూస్తావో, లేదో!

(అవధానులు కమలాకరరావుతో ప్రవేశము.)

అవ: ఇదుగో, ఈపిల్లవాడే అవ్వా, చూడు, తరువాత వంకలెంచేవు?

రాగ: వంక లెంచడానికి నేను పెళ్లాడతానటోయ్, అవధానులూ? మోహనమ్మా, నువ్వుచూచుకో.... అయ్యో, సిగ్గెందుకే? మొగమెత్తు!... పెండ్లికొడుకుకుకూడా సిగ్గే-నాయనా, ఏదీ, నీమొగం కూడా యెత్తు (ఇద్దరిమొగాలూ ఎత్తుతున్నది.) ఆఁ! చూచుకొన్నారా?

మోహ: ఉండవ్వా!

కమ: (చిరునవ్వు నవ్వుకొంటాడు.)

రాగ: అవధానులూ, కుదిరిందన్నమాటే. సంబంధాలంటే ఇలాఉండాలి, కూకటులు కొలిచిచేసిన కూరిమి పెళ్లిళ్ళు.-ఈపిల్లవానిపే రేమన్నారు?

అవ: కమలాకరరావు.

రాగ: నాయనా, పెళ్లికొడకా! తిరిగీ మాకమలనిచూచినట్లున్నదోయ్. కమలకు అచ్చు ఇదే వయస్సు. ఇదే ఆకారం. ఆకళ్లూ, ఆముక్కూ, ఆగడ్డం, అంతా కమలపోటిగ్గాపు. ఆమీసం లేకపోతే, మాకమలకు, ఈపెళ్లికొడుకుకు ఏమీభేదము కనబడదు. అమ్మా, కమలా, ఎంతమోసముచేసినావమ్మా!

అవ: అవ్వో, విచారించి లాభములేదు. పోదాము పదండి. ఈరాత్రి జాతకాలు చూచి ముహూర్తం పెడతాను. పిల్లవాడు చెన్నపట్నంలో చదువుకొంటున్నాడు. సెలవులు లేవు.

రాగ: సరే, పోదాము రండమ్మో, పోదాము.

(రాగ. మోహ. సంజీ. పోతారు)

కమ: అవధానులుగారూ, నేనున్ను పోతాను. (పోతాడు)

రంగా: అయితే అవధానులుగారూ, పెండ్లికి యేమేమి కుదుర్చుకోమన్నారు ?

అవ: అంతా పట్టీవేసి యిస్తాను. పిల్లకు అలంకారాలేమేమి పెట్ట దలచుకొన్నావో జాగ్రత్త పెట్టుకో. నీదర్జాకు తగినట్టుమాత్రం చూచుకో. జమీందారుని పెళ్లితో నీపెళ్లి కూడా జరుగుతుందని మరచిపోకు. వాళ్లా క్షేప్నకోరులు, నవ్వులపాలు కాకు.

రంగా: నాపెళ్లాం ఒంటిమీదివస్తువు లెక్కడికిపోతాయి? నాలుగుసేర్ల డాబూ (వడ్డాణం), నాలుగుసేర్ల కంటే, కట్టుకాసులపేరు, వజ్రాల ప్రధానపుంగరం, బంగారం జడ, - ఏమి ? ఇవి చాలునంటూరా ?

అవ: చాలులే, వున్నవన్నీ యిప్పుడేపెట్టేస్తే యెట్లా ? ఆతరువాత మళ్లీ అడుగుతే యెక్కడనుంచి తెస్తావు?

రంగా: (కులుకుతూ) నాపెళ్లాం నగలు మొయ్యగలదో లేదో!

అవ: మొయ్య కేంచేస్తుంది? పో, తెల్లవారగానే కనబడు.

(తెర.)

# రంగము. ౬.

(అవధానులు ప్రవేశము)

అవ : పెళ్లిళ్లేమో సాంతంగా, శాంతంగానే జరిగిపోయినవి. రంగారావువద్ద ఇంతధనమున్నదని నేనెన్నడున్నూ అనుకోలేదు. ఆమాట తెలిసిఉంటే, నా కూతురినేయిచ్చి పెండ్లిచేసిఉందును. ఏదో, అయిన దానినిగురించి విచారించడమెందుకు? నాకు ముట్ట వలసినదేదో ముట్టినది. ఏపెళ్లిలోను ఇంత దొరక లేదు.

(రంగారావు పరుగెత్తుకొంటూ ప్రవేశము.)

రంగా : అవధానులుగారో, అవధానులుగారూ, రక్షిం చాలి, రక్షించాలి!

అవ : ఏమి రంగారావూ, ఏమిటిది?

రంగా : అయ్యో! అమ్మో! భయమేస్తున్నది! కాళ్లు వణకి పోతున్నవి! ముచ్చెమటలూ పోస్తున్నవి! ఇదుగో, వస్తున్నది! వచ్చిపడె!!

(సంజీవరావు తలవిరియబోసుకొని ప్రవేశము.)

సంజీ : నేనెవరి ననుకొన్నారూ! ఎవరికిన్ని బుద్ధులులేవా?

అవ : ఏమమ్మా, ఏమిటిది?

రంగా : దానికి దయ్యముపట్టిందండీ! ఇంటిలో నన్ను వెంట బెట్టుత్తే, పరుగెత్తుకొని వచ్చినాను. నన్నుగట్టిగా పట్టుకోండి! నన్నురక్షించం డప్పా, రక్షించండి!

అవ : నే నప్పుడే అనుకొన్నాను. పెళ్లిపీటలమీదే ఆ మొగములో భూతకళ కనబడింది.

రంగా : ఏమిదారి, అవధానులూ !

అవ : భయపడకు. నాకు భూతవైద్యము తెలుసును లే, ఒక్క క్షణంలో ఆభూతాన్ని ఉచ్చాటనచేస్తాను.

సంజీ : ఏమిటిరా, అవధానులూ, నన్నుచ్చాటనచేస్తావా ? నేను నీకు లొంగుతా ననుకొన్నావురా ! నేనెవరో నీకు తెలుసునా ?

అవ : ఎవరమ్మా, నువ్వు ?

సంజీ : నేను కమలని ! ఈ పల్లెటూరిమొద్దుకి కట్టిపెట్టి నాబ్రతుకు కధ్వాన్నం చెయ్యతలపెట్టినావు ! ఇప్పుడీ సంజీవమ్మకొంపతీసినావు ! ఈ రంగడియింట్లోని ధనమంతా మూడునిముషాలలో మాయంచేస్తాను ! ఈ పిల్లను వదలిపెడతాడా, లేకపోతే, అన్నంత పనీ చెయ్యమన్నాడా ?

రంగా : అమ్మా, నావల్ల తప్పొచ్చిందమ్మా ! బుద్ధిలేక నిన్ను పెళ్లాడవలె ననుకొన్నానమ్మా ! గడ్డితిని ఈ పిల్లను పెళ్లాడినానమ్మా ! నన్ను క్షమించమ్మా ! ఏమిపని చెయ్యమంటే, ఆపని చేస్తానమ్మా !

సంజీ : చేస్తావా ?

రంగా : చేస్తాను. ముమ్మాటికీ చేస్తాను.

(రాగమ్మ ప్రవేశము.)

సంజీ : ఇదుగో, ముసలిదయ్యాం వచ్చింది ! (పటపట పండ్లు కొరుకుతున్నది.)

రాగ : ఏమిటే, సంజీవీ, ఏమి టీ వేషం ?

సంజీ : ఏమిటా ? నీగుండు సాగదీస్తానుండు !

రాగ : ఏమి టవధానులూ, ఏమిటిది ?

అవ : కమల దయ్యమయి యీ పిల్లకు పూనింది.

రాగ : భూతాన్ని వదలగొట్టలేవూ ? నీకు మంత్రాలొచ్చునే !

సంజీ : నన్ను వదలగొట్టేవాళ్లటే, మీరు? మిమ్మలి నందరినీ నాశనం చేసేస్తాను

రంగా : ఏమిదారి, అవధానులూ !

అవ : ఇది కామినీపిశాచము. ఇట్లా అట్లా పోదు. దీనికి హోమాలు, జపాలు, కావాలి.

సంజీ : నాకు హోమాలూ, జపాలూ, చేయిస్తావటరా ? అట్లాంటిపని చేసినావంటే, ఈ పిల్లనువిడిచి నీ కూతురిలో ప్రవేశిస్తాను, టేక్ కేర్ ! (Take care!)

అవ : అమ్మో, ఇది యింగిలీసుచదివినదయ్యం. ఎదురు తిరుగుతున్నాది. నాకు సాధ్యమయేటట్లు తోచదు.

రాగ : చెప్పులూ, చీపురుకట్టా, తీసుకరండి. నే నొదలగొడతా.

సంజీ : నన్ను చెప్పులతోను, చీపురుకట్టతోను కొడతా వటే, బుద్ధిలేనిదానా! ఆపని నీకవుతుంది, కాచుకో! బాక్కిదానిమంత్రాలు నామీద పారతా యను కొన్నావో! ఇదిగో, వస్తి! గొంతుకకోరి కేస్తి! ప్రాణాలమీద ఆశఉంటే, పారిపో! ఇక్కడనుంచి వెంటనేపో!... ...ఊఁ! పోవేం ?

రాగ : ఉండుండు, మీ అమ్మని, నాన్నని, అన్నయ్యని పిలుచుకొస్తాను. వాళ్ళమాటకూడా వింటావో, వినవో, చూస్తాను.

సంజీ : (దీనంగా) అవ్వా, నీకాళ్లకు మొక్కుతాను. మా అమ్మనీ, అన్నయ్యనీ, పిలుస్తే పిలువుగాని, మా నాన్నను మాత్రం పిలువవద్దు.

రాగ : అవధానులూ, దొరికిపోయింది దెయ్యం. పోయి తీసుకొస్తాను (పోతుంది.)

రంగా : అయింది దీనిపని. ఇక నేనూ నా పెళ్లామూ సుఖంగా ఉండవచ్చును.

సంజీ : ఉందువుగానిరా, ఉందువుగాని! మా నాన్నవస్తే, వదిలిపెట్టినా, ఆయన వెళ్లిపోగానే మళ్లీవస్తాను. నిన్నిట్టా అట్టా వదలిపెడతా ననుకొన్నావేమో!

రంగా : నీకేమికావాలో చెప్పమ్మా! నా పెళ్లాన్ని వదలి పెట్టు. బోలెడు దుడ్డుఖర్చుపెట్టినాను. నన్ను ఫకీరుని చెయ్యకమ్మా!

అవ : రంగారావు నీ కేటేటా చీరచూపించి, నీపేర ముత్తై దువుకు పెట్టుకొంటాడమ్మా ! వదలిపెట్టు, నా మాటవిను, కమలమ్మా !

సంజీ : నా కదేమీ పనికిరాదు!

రంగా : మరేమి కావాలో చెప్పమ్మా !

సంజీ : నేనుచెప్పినపనిచేస్తావా ?

రంగా : ఏదో, అట్లా అనుగ్రహించాలి. నువ్వేమి చెయ్య మంటే అదిచేస్తాను, చెప్పు.

సంజీ : చేస్తావా ?

రంగా : చేస్తాను, ముమ్మాటికీ చేస్తాను.

సంజీ : అవధానులూ, వింటున్నావా ? తరువాత మాట తప్పిపోయ్యాని.

రంగా : ఏమిప్రమాణం చెయ్యమంటే ఆప్రమాణంచేస్తాను.

సంజీ : అయితే, అవధానులు చేతిలో చెయ్యివేసి ఉంచు, నేనసమన్నమాట లను.

(రంగారావు అవధానులుచేతిలో చెయ్యిఉంచుతాడు.)

సంజీ : అను, "ఈసంజీవమ్మ నాపెళ్లాంకాదు. దీనిని విడిచిపెట్టేస్తాను."

రంగా : (చెయ్యితీసివేసి) ఇది నాపెళ్లాంకాదూ ? ఇంత ఖర్చుపెట్టిచేసుకొన్నది. నాపెళ్లాంకాదూ ? మరి నాకు పెళామో ?

సంజీ : నీకు పెళ్లాన్ని నేనుకుదురుస్తాను. భయపడకు. అను. నేన నమన్నమాటలను. చెయ్యిపట్టుకో! (కోప ముతో) ఊఁ !

రంగా : (అవధానులుచేతిలో చెయ్యిఉంచుతాడు.)

సంజీ : అను. "ఈ సంజీవమ్మనా పెళ్లాంకాదు."

రంగా : ఈసంజీవమ్మ నాపెళ్లాంకాదూ ?

సంజీ : "కా......దు !"

రంగా : కాదు.

సంజీ : "దీనిని విడిచిపెట్టేస్తాను."

రంగా : అయితేవిడిచిపెట్టవలసినదే ?

సంజీ : అను ! "దీనిని విడిచిపెట్టేస్తాను."

రంగా : దీనిని విడిచిపెట్టేస్తాను.

సంజీ : రంగారావ్, నువ్వుమంచివాడివి. నీమీద నాకు కనికారంపుట్టింది. నీకుమేలుచేస్తాను. అవధానులు చెయ్యి విడిచిపెట్టకు. నేనన్నమాట లను.

రంగా : మేలుచేస్తానంటున్నావు. తప్పకుండా అంటాను.

సంజీ : అను. "అవధానుల కూతురిని పెళ్లాడుతాను."

అవ : ఆఁ !

రంగా : ఆఁ ! అవధానులు కూతురినా ? ఆ మసిబొగ్గునా ? ఆ చీకికళ్లదానినా ?

(చెయ్యి వదలిపెట్టబోతున్నాడు. అవధానులు రంగారావు చెయ్యి గట్టిగా పట్టుకొంటాడు.)

అవ : ఇదుగో, కమలమ్మా, రంగారావు నాచెయ్యి వదలి-
పెట్టుతున్నాడు.

సంజీ : వానితరం, వా నబ్బతరం, వదలిపెట్టడానికి. ఏమ్,
రంగారావ్, అంటావా, అనవా ?

రంగా : అంటానమ్మా, అంటాను.

సంజీ : రంగారావ్, నువ్వు భయపడకు. అవధానులుకూతు
రికి యౌవనమిస్తాను, అందమిస్తాను. కడుపునిండా
పిల్లలనిస్తాను. నీవంశం అభివృద్ధిచేస్తాను. మిమ్మలి
నందరినీ కాపాడుతూ ఉంటాను. అను ! "అవధా
నులు కూతురిని పెళ్లాడుతాను."

రంగా : అవధానులు కూతురిని పెళ్లాడుతాను.

సంజీ : అవధానులూ, నువ్వను. "మారుమాట్లాడకుండా
నాకూతురుని రంగారావు కిస్తాను."

అవ : కమలమ్మా, రంగారావు తనకున్న నగలన్నీ సంజీ
వమ్మకు పెట్టినాడు. నాపిల్లగ తేమిటి ? ఆ తరువాత
రాగమ్మ ఆనగలు స్త్రీధనమని రాబెట్టుకోదూ ?
నాపిల్ల ఉత్తనల్లపూసలతో ఉండమంటావా ?

సంజీ : నువ్వుభయపడకు రాగమ్మగాని, సంజీవమ్మగాని,
యితరబంధువులుగాని,ఆనగల కాసించకుండా చేయ
డము నాభారం. రంగారావ్, సంజీవమ్మకు
పెట్టిన నగలన్నీ అవధానులుకూతురికి పెట్టు.

రంగా : అయితే సరే.

సంజీ : అవధానులూ, నేననమన్నమాట లను.

అవ : రంగారావుకు నాకూతురుని తప్పకుండాయిస్తాను.

సంజీ : ముమ్మాటికీ ?

అవ : ముమ్మాః

సంజీ : రంగారావ్, నువ్వుపెళ్లి చేసుకొంటావు ?

రంగా : చేసుకొంటాను.

సంజీ : ముమ్మాటికీ ?

రంగా : ముమ్మాటికి.

అవ : కమలమ్మా, ఇంక వెళ్లిపో, అమ్మా. మమ్మలిని మరి అల్లరపెట్టకు.

సంజీ : వెళ్లతాను. మానాన్నగారి దర్శనం చేసుకొని పోతాను.

(రాగమ్మ, సుబ్బారావు, ప్రవేశము.)

సంజీ : (సుబ్బారావు కాళ్లమీదపడి) నాన్నగారూ, నన్ను క్షమించాలి. నాఅపరాధం మన్నించాలి !

సుబ్బా : అమ్మా, కూతురా ! ఎంతసాహసంచేసినావమ్మా ! ఎంతమోసంచేసినావమ్మా! (కంట తడిపెట్టుతాడు.)

రాగ : అయ్యో కమలమ్మా, నాతల్లీ ! (ఏడుస్తుంది.)

(కమలమ్మ ఎప్పటివేషముతో ప్రవేశము.)

రంగా : అమ్మో! కమలమ్మ! కమలమ్మ! ధయ్యం! దయ్యం! (పారిపోతున్నాడు.)

కమ: నాన్నగారూ, నమస్కారం. నన్నుక్షమించాలి. (కాళ్లమీాద పడుతున్నది.)

రాగ: సుబ్బా, దూరంగా పోరా! కమలమ్మా, నాకొడుకును వదలిపెట్టమ్మా! నాకొడుకులందరికీ వీడొక్కడే మిగిలినాడు.

కమ: నాన్నగారూ, నాముొగంచూడండి. నేనుచచ్చిపోలేదు. నేనునిజంగా మీాకమలనే.

రాగ: దయ్యాలన్నీ ఇట్లాగే మాట్లాడుతాయి! పో, అమ్మా, కమలా! చెన్నపట్నంలో సముద్రపొడ్డుకుపో. అక్కడనుంచి మరిరాకమ్మా!

అవ: కమలమ్మా, నీకుసంగీతమంటే చాలాయిష్టం. అక్కడ సముద్రపొడ్డున యంత్రాలు పాడుతూ ఉంటాయట. అవి వింటూ, అక్కడనే ఉండమ్మా! మమ్మలిని బాధపెట్టకు.

కమ: నేను దయ్యాన్నికాను,నాన్నా, నాముొగంచూడు.

సుబ్బా: నేనెట్లా నమ్మడం?

రాగ: దీనిమాటలునమ్మకురా, నాయనా!

(సీతమ్మ, రామారావు, ప్రవేశము.)

రామా: ఏమిటీ గందరగోళమంతా?

రాగ: నీ చెల్లెలు దయ్యమయిందిరా, అదుగో!

సీత: నువ్వు దయ్యానివా? మాకమల దయ్యమా? రా, అమ్మా, కమలా. ఎన్నాళ్లయిందమ్మా,

ఈరూపముతో నిన్ను చూచి ! అవధానులింట్లో ఎంత కష్టపడినావమ్మా, కూతురా !

కమ : ఈయనయింట్లో నే నేమిన్ని కష్టపడలేదు. ఆయన నన్ను రాజపూజితంగా చూచినారు. ఈయనఋణం మనము తీర్చుకోలేము.

అవ : ఏమిటీ, కమలమ్మ ఇన్నాళ్లున్న నాయింట్లోనే ఉందా ?

రామా : అవధానులు మామగారూ, ఆకమలాకరరావే కమలమ్మ.

అవ : ఆఁ ! ఆఁ !

రామా : కమలమ్మకు మీరుపెళ్లిచేసిన మోహనమ్మ మోహనరావు.

సీత : ఏమిటిరా, పెంకెనాగమ్మా, ఇదంతా నీ పన్నాగమేనా ?

రామా : మోహనరావ్, ఇలారావోయ్, వీళ్లుచూస్తారట !

రాగ : నేననుకొంటూనేఉన్నాను. ఇదంతాఏదో తమాషా చేస్తున్నారని.

రామా : నువ్వనుకోని దేముంది, అవ్వా ! నీయిష్టమే నెరవేరిందిలే!

(మోహనరావు ఎప్పటివేషముతో ప్రవేశము.)

మోహ : మామగారూ, నమస్కారం. నన్నూకమలనీ క్షమించాలి.

రామా: మోహనా, ముందర మాఅవ్వకు మొక్కు. విఘ్నే శ్వరపూజకానిదీ, ఏపనీ సాంతంకాదు. మాఅవ్వ విఘ్నేశ్వరమ్మ.

రాగ: రామూ, నీపెంకెమాటలు మానినావుకావు.

కమల: అవ్వా, మమ్మలినిదీవించు. నువ్వేకదా దగ్గరఉండి మాపెళ్లిచేయించినావు.

రాగ: అవునమ్మా, దంపతులిద్దరున్ను గువ్వపిట్టలలాగ, అన్యోన్యంగా, సుఖంగా ఉండండి. దీర్ఘాయుష్యమస్తు.

మోహ: మామగారూ, మమ్మాశీర్వదించండి.

(మోహ. కమ. నమస్కరిస్తారు.)

సుబ్బా: దీర్ఘాయుష్యమస్తు. అమ్మా, కమలా, నాకన్నుల పండువయిందమ్మా. నువ్వుకోరుకొన్న వరుడు, ఈడూజోడూ అయినవాడు, నీకుదొరికినాడు. ఇదంతా మారామునిమూలాన జరిగింది. వానికి మన మంతా కృతజ్ఞులమైఉండాలి.

సంజీ: అందరున్ను నన్నుకూడా క్షమించాలి. మోహనమ్మ వలెనే నేనున్ను సంజీవమ్మనుకాను. నాపేరుసంజీవ రావు (విగ్గు, చీర, తీసేస్తున్నాడు.)

సుబ్బా: నువ్వెవరు?

సంజీ: నేనుమోహనరావు స్నేహితునితమ్ముణ్ణి. నాది సంధ్యాల. సెలవలకని అతను నన్నిచటికి తీసుకవచ్చి నాడు.

రాగ : అంతా బాగానే ఉంది. కాని, మా రంగడిపనే అధ్వాన్నమయింది.

అవ : ఏమీ అధ్వానంకాలేదు. నా కూతురుని వానికిస్తున్నాను.

సీత : రంగారావు ఒప్పుకొన్నాడా ?

అవ : ఆ ! ఒప్పుకొన్నాడు. రేపే ముహూర్తం. మీరందరున్నూ వచ్చి నన్ను సంతోషపెట్టాలి. శుభలేఖలు పంపడానికి వేళలేదు.

రామా : ఏడీ, రంగారావెక్కడున్నాడు ?

అవ : భయముతో విశ్వనాథయ్యగారి యింట్లో దాగున్నాడు.

రామా : నేనుపోయి తీసుకవస్తాను. (పోతాడు)

రాగ : అవధానులూ, నగలమాట నిశ్చయించుకొన్నావా?

అవ : ఆ ! ఆ నిశ్చయంకూడా అయింది.

రాగ : ఇంకేం ? నువ్వవధానుల వవుదువు ! అదృష్టమంతుడవే ! నీ కూతురికి పెండ్లెట్లా అవుతుందిరా అనుకొంటూ ఉండేదానిని. మంచి అల్లుడినే సంపాదించినావు.

(రామారావు, విశ్వనాథయ్యలు రంగారావును పట్టుకొని ప్రవేశము.)

రంగా : అబ్బా ! నేనురాను. నన్ను విడిచిపెట్టండి. నాకు కాళ్లు వణకుతున్నాయి.

రామా: భయములేదోయ్, రా!......ఇదిగో, రంగడు. రంగా, కమలమ్మ బ్రతికేఉంది. దయ్యంకాలేదు. ఇదుగో!

రంగా: అమ్మో!

రాగ: రంగా, పిచ్చిపుల్లయ్యావి కాకు. కమలను మోహన రావుకిచ్చి పెండ్లిచేసినాము. అయితే నేమిలే, నీ కవధానులు పిల్లనిస్తాడు, నువ్వూ నీ పెళ్ళామూ సుఖపడండి.

రామా: విశ్వనాథయ్యగారూ, మీరు మంగళంపాడండి.

విశ్వ: (మంగళం పాడతాడు)

(తెర.)

డాక్టరు చిలుకూరి నారాయణరావు, ఎమ్.ఏ., పిఎచ్. డి. గారు
రచించిన నాటకములు.

## 1. అంబ లేక మొండిశిఖండి.

భారతకథలను నాటకములుగా ఎందరో వ్రాసినారుగాని ఈ క్రొత్తమార్గములో ఇదివరకెవరున్ను వ్రాయలేదు. మొదటినుంచి కొసవరకున్ను చల్లనిహాస్యము. మాటమాట కున్ను మందహాసమును పుట్టిస్తుంది. రెండు గంటలలో ఆడవచ్చును. 0-8-0

## 2. అశ్వత్థామ.

ఇంతమంది భారతకథలను నాటకముగా వ్రాసినారుగాని 'అశ్వత్థామ' రాజభక్తిని, పితృభక్తిని, శౌర్యమును, వీర్యమునుచిత్రించి ఉండలేదు. అద్భుత, బీభత్స, భయానక, కరుణ రసముల కీనాటిక పుట్టినిల్లు. అక్కడక్కడ క్రొత్తరీతి హాస్యరసము వెల్లివిరుస్తూఉంటుంది. గంటన్నరకాలములో ఆడవచ్చును. 0-6-0

## 3. అచ్చి లేక కాపువలపు.

ఇట్టినాటక మాంధ్రవాఙ్మయములో ఇంతవరకున్ను

పుట్టలేదు. అచ్చికి త్తయ్యల అమాయకప్రేమ ఇందద్భుత ముగా నిరూపించబడినది. అద్భుతభావగర్భితము. అనేకవిధ ములగు కాపుపాటలు, పడవపాటలు, రాజకీయములగు పాట లతో ఒప్పుతున్నది. ఈప్రదర్శనమును చూచినవారు విరుగబడి నవ్వినారు. సర్ సి. వి. రామన్ గారివంటి వారిని మాటమాటకును నవ్వించి ఆయనప్రశంసను పొందినది. ఒకటిన్నరగంటలలో ఆడవచ్చును 0-6-0

## 4. (i) వాడే (ii) నాటక ప్రస్తావన.

పై రెండునాటికలును ఒక్కసంపుటిగా ప్రకటింపబడి నవి. 'వాడే' అనేది పరిశోధకనాటకము. హాస్యరస ప్రధానము. 'నాటకప్రస్తావన' అనేదానిలో యిప్పటి నట కులలో ప్రబలిఉన్న దురాచారములు అద్భుతముగా చిత్రించబడినవి—'వాడే' ఒకగంటలోను. 'నాటకప్రస్తా వన' అర్ధగంటలోను ఆడవచ్చుచు. రెండున్ను కలిసి. 0-8-0

## 5. పెండ్లి.

సాంఘికనాటకము. కేవలము హాస్యరసమే ఈరూప మును తాల్చినదా అనిపిస్తుంది. రంగారావుపాత్రము ఆంధ్ర నాటకప్రపంచమున క్రొత్తసృష్టి. గంటన్నర కాలములో ఆడవచ్చును. 0-6-0

# ఇతర గ్రంథములు.

1. అశోకునిధర్మ శాసనములు - పాలిమూలము, సంస్కృతాంధ్రానువాదములు. చక్కని ఉపోద్ఘాతము. 2-0-0
2. సంస్కృతశ్లోకోక్తులు - అనేక సంస్కృతగ్రంథములనుండి ఏర్చి కూర్చి, అర్థవివరణముతో ప్రకటింపబడినవి. 1-0-0
3. ఉమార్ ఖయాము అనుపారసీకకవి రచించిన రుబాయత్ అనుపద్యములకు తెనుగుముత్యాలసరములవరుస. రసికులు మెచ్చుకొన్నది. 0-8-0
4. ఉపనిషత్తులు (ఈశ, కేన, కఠ, ఐతరేయ) స్త్రీలును బాలురునుకూడ చదివి ఆనందించవచ్చును. సులభమైన పద్యములు, పాటలుగా వ్రాయబడినవి. 0-6-0
5. University Exercises in Translation. Passages on a variety of modern subjects culled from the works of great authors. A Telugu glossary of difficult words is given at the end. Even a reading of the English passages enriches the store of the students' knowledge. 0-12-0
6. పిల్లల పాటలు. 0-1-0
7. జర్మనీదేశ విద్యావిధానము-సంపూర్ణవర్ణనము. 1-0-0
8. The Songs of Tyāgarāja. In English characters and with a fine, poetical English Translation. Highly praised throughout India and abroad. 2- -0

కలయువారు: ఆత్రేయాశ్రమము, అనంతపురము,

